సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 40
16-6-54

జయ జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ బుధవారం




### బుధవారం, జూన్ 2:

ఇండోచీనాలో యుద్ధ విరమణకోసం ఫ్రెంచి, వియత్మిన్ సైనికాధికార ప్రతినిధులు సమాలోచనలు ప్రారంభించారు.

—దక్షిణ ఇండోచీనాలో సైగాన్‌కు పది మైళ్ళ దూరంలో ఒక కోటపై కమ్యూనిస్టులు అకస్మాత్తుగా దాడిచేసి ఆక్రమించారని సైగాన్ వార్త.

—వి. కె. కృష్ణమీనన్ లండన్‌నించి తిరిగి జినీవా వచ్చి, మాలటోవ్ మొదలైన ప్రతినిధులతో సమాలోచనలు జరిపారు.

—ఏటంబాంబు నిర్మించిన డా॥ జె. రాబర్ట్ ఓపెన్‌హీమర్‌ను అణుశక్తి రహస్యాలకు దూరంగా ఉంచాలని అమెరికన్ ఎటామిక్ ఎనర్జీ కమిషన్ నియమించిన స్పెషల్ సెక్యూరిటీబోర్డు నిర్ణయించింది.

## విషయానుక్రమణిక



### గురువారం, జూన్ 3:

—ఇండోచీనా యుద్ధవిరమణలో ఐక్యరాజ్యసమితి పర్యవేక్షణకు సమ్మతించబోరని జినీవాలో చీనా, వియత్మిన్ ప్రతినిధులు తెలియపరిచారు.

—ఇండోచీనాలో యుద్ధ విరమణ తరవాతపర్యవేక్షణకు తటస్థసంఘంలో చేరడానికి పాకిస్తాన్ సమ్మతించగలదని పాకిస్తాన్ విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖాన్ లండన్‌లో ప్రకటించారు.

—ఇండోచీనాలో మిలిటరీ పరిస్థితి దృష్ట్యా చేయవలసిన సహాయాన్నిగురించి అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి, ఆస్ట్రేలియన్, న్యూజీలాండ్ సైనికాధికారుల సమాలోచనలు వాషింగ్టన్‌లో ప్రారంభమైనాయి.

—ఇండోచీనాలో జనరల్ నెవార్ స్థానే జనరల్ ఎలీని సర్వసైన్యాధిపతిగా ఫ్రెంచిప్రభుత్వం నియమించింది.

—రష్యన్ ఆక్షేపణను నిరాకరించి భద్రతామండలి థాయ్‌లాండ్ విజ్ఞప్తిని చర్చించడానికి తీర్మానించింది. (ఇండోచీనా - థాయ్‌లాండ్ సరిహద్దులలో దురాక్రమణసూచనలు కనపడుతున్నందువల్ల పరిశీలనసంఘాన్ని అక్కడికి పంపాలని థాయ్‌లాండ్ ప్రభుత్వం విజ్ఞప్తి చేసింది. ఈనెల భద్రతామండలి అధ్యక్షుడు అమెరికన్ ప్రతినిధి. థాయ్‌లాండ్ విజ్ఞప్తిచేసినవెనువెంటనే సమావేశం జరుపబడింది.)

—మిత్రరాజ్యాలకు అణుశాస్త్ర రహస్యాలను అవసరమైనప్పుడు తెలియపరచడానికి వీలుగా ఎటామిక్ సీక్రెట్స్ ఆక్టును సవరణచెయ్యాలని అమెరికన్ కాంగ్రెస్‌కు విదేశాంగమంత్రి డల్లెస్ సూచించారు.

### శుక్రవారం, జూన్ 4:

—కొలంబో సమావేశ రాజ్యాలతో (ఇండియా, పాకిస్తాన్, బర్మా, ఇండొనీషియా, సింహళం) ఇండోచీనాలో ఆర్మిస్టిస్ కమిషన్ నియామకానికి కొన్ని షరతులపైన ఫ్రెంచి విదేశాంగమంత్రి బిడాల్ట్ అంగీకరించగలడని జినీవాలో ఫ్రెంచి వర్గాలవారు కొందరు తెలిపారు.

—బావోదాయ్‌తో చేసుకున్న రెండు వియత్నామ్ ఒడంబడికలపైనా పారిస్‌లో ఫ్రెంచి, వియత్నామ్ ప్రభుత్వ ప్రతినిధులు సంతకాలు పెట్టారు.

—భారతదేశానికి ఆర్థికసహాయ మివ్వాలని అమెరికన్ సెనేట్ విదేశాంగ వ్యవహారాల కమిటీలో విదేశాంగమంత్రి డల్లెస్ విజ్ఞప్తి చేశాడు.

—భారతదేశంలోని ఫ్రెంచి ఆక్రమిత ప్రాంతాలనుగురించి ఫ్రెంచి, భారతప్రభుత్వాల ప్రతినిధులమధ్య మూడువారాలుగా పారిస్‌లో సాగుతున్న రాజీ సమాలోచనలు విఫలమైనాయి. భారత ప్రతినిధి ఆర్. కె. నెహ్రూ పారిస్ సమాలోచనలనుగురించి పారిస్‌లో వివరించారు.

—దేశంలో పరిశ్రమాభివృద్ధి పెట్టుబడి వృద్ధిని గురించి రిజర్వుబాంకుకు ప్రాఫ్ కమిటీ సమర్పించిన నివేదిక ప్రచురించబడింది.

—మద్రాసు రాష్ట్రంలో నిరుద్యోగ బాధ నివారణకోసం 1954-55 లో 1270 కొత్త స్కూళ్ళను స్థాపించడానికి రాష్ట్ర ప్రభుత్వానికి కేంద్రప్రభుత్వం ధనసహాయ మివ్వగలదని తెలియపరిచింది.

—హైదరాబాదు భవిష్యత్తును గురించి హైదరాబాదు ప్రభుత్వం ఫజల్ అలీ కమిషన్‌కు ఏ నివేదికా సమర్పించకపోవడానికి కారణాలు అది ఉమ్మడిప్రభుత్వం కావడం, వివిధాభిప్రాయాలుండడం అని ముఖ్యమంత్రి రామకృష్ణరావుగారు తెలియపరిచారు.

—మాధ్యమిక తరగతులను ఇంటర్మీడియట్ కోర్సునూ రద్దుపరిచి ఆరేళ్ల ప్రైమరీ కోర్సు, ఆరేళ్ల సెకండరీ కోర్సు నెలకొల్పడానికి ఉర్దూ, తెలుగు, తమిళ భాషలను రద్దుపరచి కన్నడం ఇంగ్లీషు నిర్బంధంగా బోధించాలని మైసూరు కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ తీర్మానించింది.

—ప్రాథమిక పాఠశాలల నిర్వహణను సలహాసంఘాల కొప్పగించరాదని ఆంధ్ర రాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ సంఘం తరఫున ఒక కమిటీ విద్యామంత్రివద్దకు రాయబారం వెళ్ళింది.

### శనివారం, జూన్ 5:

—ఆర్మిస్టిస్ కమిషన్‌నియామకంగురించి ఏకాభిప్రాయం కుదరనందువల్ల జినీవాలో ఇండోచీనా చర్చలు విఫలంకాక తప్పదని జినీవావార్త.

—కొరియాలో ఎన్నికల పర్యవేక్షణకు

(49-వ పేజీ చూడండి)

# 'గురకల' వాసం!




ఏడుకొండలవాడ! శ్రీవెంకటేశా!—ఏడు మంత్రులవాడ! 'గురకల'నివాసా!

# కాలక్షేపం

"స్మరతిమిర ప్రచార భవ
  శశ్వదబోధము గల్గువేళ మే
దురగతి ముజ్జగంబులు
  వధూమయమై కనవచ్చె; నిప్పుడిం
పరయగ సద్వివేక మహి
  తాంజన సంగతమై మదీయ భా
సుర సమదృష్టి బ్రహ్మముగ
  జూచుచున్నది విశ్వమంతయున్."

తా॥ మన్మదాంధకారము వ్యాపించుట చేత కలిగిన స్థిరమగు అజ్ఞానము ఏర్పడిన కాలమందు నాకు ముజ్జగంబులున్నూ ఒక్క తీరుగా స్త్రీమయముగా కన్పించెను. ఇప్పుడు మంచి వివేకమనెడి కాటుకను పూసికొనుటవల్ల నాయొక్క నిర్మలమైన దృష్టి యీ లోకమునంతటిని బ్రహ్మమయముగా చూడగల్గుచున్నది.

"జగమంతా రామమయం" అంటాడు ఆంజనేయునివంటి రామభక్తితత్పరుడు. కాబట్టి ఏది మననం చేస్తే అదే మనకు కండ్లకు కట్టినట్లుంటుంది. మైకేల్ యాంజిలో అనేటటువంటి గొప్ప శిల్పకారుడు ఉండేవాడు. పెద్దపెద్ద శిలలను చక్కని దేవతా విగ్రహాలుగా చెక్కియున్నాడు. ఒకనాడు ఒక కొండప్రక్కనుంచి నడచిపోతూ ఉన్నప్పుడు అక్కడ పడియున్న ఒక బ్రహ్మాండమైన శిలనుచూచి, *"I see an angel in that stone"* (ఈ రాతిలో నాకొక దేవత కన్పిస్తోంది) అన్నాడు. అంటే అర్థం ఏమిటి? ఈ శిలను చక్కగా మలిచి తొలిచి ఒక దేవతావిగ్రహం తయారు చేయవచ్చుననే తలపు ఆ శిల్పికి తటుక్కుమని తోచింది. కాబట్టి అటువంటి శిల్పదృష్టితో సృష్టిని పరికించేటటువంటివానికి రాళ్ళన్నీ దేవుళ్ళుగా దేవతలుగా కన్పిస్తాయి. కాని, మానవుడైనవాడు చెక్కేటటువంటి దేవతావిగ్రహములన్నియు ముప్పాతికమువ్వీసం మనుష్యరూపంలోనే ఉంటాయి. రవివర్మ లక్ష్మి ఆకారం చక్కగా చిత్రించాడు. సరస్వతి ఆకారంకూడా చక్కగా చిత్రించాడు. కనుముక్కుతీరులో లక్ష్మికిన్నీ సరస్వతికిన్నీ ఏమైనా వ్యత్యాసం ప్రత్యేకించి ఉన్నదా అంటే అత్యంత శ్రద్ధతో పరిశీలించినా అరవీసమైనా తేడా లేకుండా ఒకటే అచ్చులో పోసినట్లు ఒకటే మచ్చుగా ఉంటాయి. తిరువాన్కూరు సంస్థానపు రాజవంశంలోని రాజబంధువు యీ రవివర్మ మహాశయుడు. ఆ తిరువాన్కూరు సంస్థానం మళయాళ రాజ్యంలో చేరినదే. అదంతా కేరళరాష్ట్రంలో చేరవలసినదే. అక్కడ ఉండే మళయాళ స్త్రీలు, నాయరు కుల స్త్రీలు, అందచేసి అందకత్తెలని ప్రసిద్ధివహించారు. అసలు మళయాళం అంటేనే ఆడ మళయాళం అనే పేరు పరిపాటి అయింది. తిరువాన్కూరు రాజవంశంలో జేరిన శ్రీమంతుడున్నూ, నాయరు స్త్రీల అందమును మకరందమువలె ఆస్వాదించినట్టివాడున్నూ అగు రవివర్మ మహాశయుడు "దేవతలంటే వాళ్ళే" అన్నట్లుగా చిత్రించాడు. అంతకంటె అతీతంగా చిత్రిస్తే అతని బొమ్మలు అతనికే రుచించవు.

శ్రీవైష్ణవుడు తపస్సు చేయగా చేయగా శ్రీమహావిష్ణువే ప్రత్యక్షమవుతాడు గాని పరమశివుడు ప్రత్యక్షంకాడు. రవివర్మకు చంద్రధరుడు కలలోకూడా కన్పించడు. తిరువనంతపురంలో వేంచేసిన అనంతపద్మనాభస్వామిఅప్పుడప్పుడైనా ఆత్మదైవంగా ఆయనకు కన్పించి ఉంటాడు. ఆయనకు కలలో పద్మనాభస్వామి ప్రత్యక్షమైతే "ధన్యోస్మి! ధన్యోస్మి!" యని ఆనందించవచ్చు. అటువంటి స్వప్నావస్థలో స్వామి కన్పించినప్పుడు కలిగేటటువంటి ఆనందానికి ప్రత్యేకమైన ప్రాశస్త్యం ప్రాధాన్యం ఉంది. ఆలయంలోనికి వెళ్ళి స్వామివారి విగ్రహమును సందర్శించినప్పుడు ఆ స్వామిని మనబాహ్యచర్మచక్షువులతో సందర్శించినట్లుగా పరిగణిస్తాము. కాని, ఆ విగ్రహమే మనము కళ్ళుమూసికొని నిద్రిస్తున్న సమయంలో కన్పిస్తే, అది మనజ్ఞానచక్షువులకు సాక్షాత్కారించినట్లుగా అన్వయిస్తాము. అతేమాత్రంచేత, ఆ సాక్షాత్కారంలో గొప్పదనం ఉన్నదని చెప్పజాలము. అసలైన కారణం ఏమిటంటే, స్వామియొక్క మూర్తి తనకు అప్రయత్నంగా కన్పించడంవల్ల తన హృదయంలో స్వామి ప్రవేశించినాడనిన్ని, ఇక తన జన్మ సార్థకమైనదనిన్నీ భావించి ఆనందభరితుడు కావడం భక్తుని తత్వం. రాజుగారి దర్శనార్థం మనం వెళ్ళినప్పుడు రాజుగారి దర్శనమైతే, అందుకు ఆనందిస్తాం. నిజమే - కాని, రాజుగారే మనయింటికి వచ్చి మనకు దర్శనమిస్తే, అమందానందకందళిత హృదయారవిందులమై, త్యాగరాజులవంటి స్వరరాగసుధామాధుర్యానుభవనిమగ్నులమైతే, "నడచి వచ్చితివో - నా ప్రాణ నాథ" అని ఆలాపన తప్పకుండా చేస్తాము. త్యాగరాజుగారికి ఒక్కతే కొమార్తె. వేరే సంతానం లేదు. ఆ కుమార్తెకు త్యాగరాజులవారు సీతా మహాలక్ష్మియని పేరు పెట్టుకొన్నారు. సీతా మహాలక్ష్మిని కుప్పుస్వామి అయ్యరు అనే వరునకిచ్చి తిరువాదిలో వివాహం చేశారు. అప్పుడు త్యాగరాజుగారి శిష్యులు ఆప్తులు చాలామంది అనేక వస్త్రాభరణాలు కానుకలుగా వధూవరుల కిచ్చారు. కాని రాయవేలూరు పల్లవి యల్లయ్యగారు అనే ప్రముఖుడు తాను స్వయంగా చిత్రించిన పటము నొకటి త్యాగరాజుగారికి బహుమానంగా ఆ శుభముహూర్తకాలమందు యిచ్చారు. సీతా లక్ష్మణ హనుమత్సమేతకోదండరామస్వామివారి పెద్దసైజు చిత్రపటం అది. ఆ పటంతోబాటుఒక శాలువ వస్త్రములు కూడా ఆయనకు సమర్పించారు. త్యాగరాజుగారు ఆ కానుకలన్నింటిని అక్కడనే ఉంచి ఆ కోదండరామ పటమును మాత్రం ఆతురతతో తన పూజాగృహమునకు తీసికొనివెళ్ళి పూజించి, అప్పుడు ఆనందపరవశుడై, మోహనరాగంలో "నను పాలింప నడచివచ్చితివో నా ప్రాణ నాధ.................................
కరమున శరకోదండముతో — ధరణి తనయతో - త్యాగరాజార్చిత" అనే కృతిని పాడియుండిరి. ఈ కోదండరామపటము యీనాటికిన్నీ తిరువాదిలో ఉన్నది. పంచనదబ్రహ్మంగారి మునిమనుమడగు రాముడుభాగవతార్ గారిచే స్వగృహమందు పూజింప బడుచున్నది. ఆ భక్తునకు అభక్తి పారవశ్యం కలుగుటకు ఆ పటము పారితోషికంగా తన యింటికి రావడమేచాలు.. తన ప్రాణనాథుడు తన యింటికి తన్ను పాలించుటకై వచ్చినాడని మోహావేశ పరవశురాలైన భార్యవలె మోహనరాగంలో అమోఘంగా పాడగలిగినవానికి. రాముడంటే

## పూర్తి శ్లోకం?

పాఠకాధములు ఆరు రకాలవారు ఈ క్రిందిశ్లోకంలో వివరింపబడినారు.

గీతీ శీఘ్రీ శిరః కంపీ తథా లిఖిత పాఠకః

.............షడేతే పాఠకాధమాః.

ఈ శ్లోకం పూర్తిగా తెలిసినవారు ఆంధ్ర సచిత్ర వారపత్రికకు వ్రాసి పంపగోరెదము.

ఎక్కడో లేడు ఆయన ఆత్మలోనే లీనమై ఆత్మారాముడై యున్నాడని అర్థము. నిజంగా ఆ కీర్తన త్యాగరాజుగారు పాడుతూ ఉన్నప్పుడు, "నను పాలింప నడచివచ్చితివో నా ప్రాణనాథ!" అని ఆనందపరవశుడైనప్పుడు, సీతాఅమ్మవారు ప్రక్కనే ఉండి ఆ కీర్తనను వినినట్లయితే, ఆమె తనమనస్సులో నవ్వుకొని, తన భర్తయైన శ్రీరామచంద్రమూర్తి వంకజూచి, "స్వామీ! మీకు నేను ఒక్కతెనే భార్యననుకున్నాను. ఒకమాట, ఒక బాణము, ఒక పత్నీవ్రతుడనే విఖ్యాతి గడించిన మీకు త్యాగరాజుగారు రెండో భార్యగా తయారైనారు. లేకపోతే, "నా ప్రాణనాథ!" అని మీమీద జావళీలు పాడి అంత విరహతాపం ఎందుకు చూపిస్తారు? నాకు సవతులు లేరని సంతోషించాను ఇంతకాలం నుంచీ- కాని మీభక్తులందరూ మీ భార్యలయ్యేటట్లుగా ఉన్నారు. అయోధ్యలో ఉన్నా, అడవిలో ఉన్నా, నేను దగ్గర ఉన్నా, దగ్గర లేకపోయినా, మీకు భార్యలేని లోటు లేకుండా చేస్తారు మీ భక్తులు. ఫరవాలేదు లెండి. ఇక నేను పించను పుచ్చుకోవచ్చు" అని శ్రీరామచంద్రునితో సీతామహాలక్ష్మి సరసంగా మేలమాడి హేళన చేయుటకు వీలైన ధోరణిలో తన మోహం చూపించాడు యీ మోహనరాగంలో, శ్రీరామచంద్రుని మోహనాకారం చూచిన త్యాగరాజు.

అయితే, భక్తుడైనవానికి ఇటువంటి ఆకారపటం అనేది ఒక హృదయావేశానికి ప్రేరేపణగా మాత్రం ఉంటుంది. శ్రీరామచంద్రమూర్తిమాత్రము సీతామహాదేవిని గాఢంగా ప్రేమించలేదనగలమా? శ్రీరామునియందు సీతకు ఎటువంటి అచంచల అకుంఠిత అభేద్య అతులిత అనురాగాతిశయం ఉన్నదో, శ్రీరామునకు కూడా సీతమీద అటువంటి అనురాగాతిశయం ఉంది. పర్ణశాలలో సీత కన్పించలేదంటే శ్రీరాముడు ఎన్నివిధాలుగా విలపించాడో ఆ మహారణ్య తరు గహన గుహావిహారములకే ఎరుక. "వృక్షములారా! సీతను ఎక్కడైనా చూచినారా!" అని తరులను గిరులను ఝరులను ప్రశ్నించాడు. శ్రీరాముడు అంత అజ్ఞానియా? అని అజ్ఞానులు కొందరు ప్రశ్నిస్తారు. అటువంటి అనురాగం, అటువంటి రసోద్వేగం ఏ హృదయంలో కలుగుతుందో అందులో చేవ ఉంది. అందులో చైతన్యం ఉంది. అది అధైర్యం కాదు. అది హృదయానికి అవసరమైన అయిశ్వర్యం. శ్రీరామునిలోని యీ హృదయైశ్వర్యం చూచియే రాముడు నా హృదయేశ్వరుడని సీత నిశ్చింతగా ఆనందంగా అడవిలో కాపురం చేసింది ఆ స్వామితో కలిసి.

ప్రాణంమీద యీ శరీరానికి ఎంత తీపి, ఎంత మక్కువ, ఎంత అనురాగం ఉందో, యీ శరీరంమీద ప్రాణానికి కూడా అంత తీపి, అంత మక్కువ, అంత అనురాగం ఉంది. శరీరంలోని ఏ భాగమైనా రవ్వంత నిప్పురవ్వ పడి బొబ్బ ఎక్కితే, ప్రాణం తల్లడిల్లిపోతుంది. ఈ శరీరంమీద ప్రాణానికి ఎంత విసుగు పుట్టినప్పటికీ దేహత్యాగం చేయడానికి ప్రాణం ఒప్పదు. దేహత్యాగం చూస్తూ చూస్తూ యీ జీవుడు చేయడు. ప్రాణత్యాగం చూస్తూ చూస్తూ చెయ్యడానికి యీ దేహికి చేతులురావు. ప్రాణంమీద ఎంతో విసుగుపుట్టి నూతిలో దూకి ప్రాణత్యాగం చెయ్యాలని సంకల్పించిన యిల్లాలు ఒకనాడు పాడు నూతివద్దకు అందరూ నిద్రపోయే సమయంలో అర్ధరాత్రివేళ వెళ్ళింది. ఆనాతి నూతివరకూ వెళ్ళిందిగాని, పాడునూతిలోని పాడుకప్పలు బెక బెక మనేసరికి భయంవేసి "మాధవా మన రథంబు మరల నిమ్ము" అన్నది. "బ్రతికియుండిన భాగ్యముల్ బడయవచ్చు" అనే ఆశ యీ శరీరానికి ఉంది. శరీరాన్ని సుఖపెట్టవలెననే సంకల్పం జీవునకు ఉంది. ఈ జీవుడూ, యీ దేహమూ ఒకరినింకొకరు విడిచిపెట్టలేరు. అంత అన్యోన్యంగా, అవినాభావంగా వారే వీరు, వీరే వారు అన్నట్లుగా ఏకంగా ఉంటారు.

ప్రకృతిఅంటే బయటఉండే జడ ప్రపంచం అని ప్రత్యేకించి అర్థం చెప్పనక్కరలేదు. మనభౌతిక శరీరంకూడా ప్రకృతి అనబడే జగత్తులోని భాగమే. బాహ్యప్రపంచం అంటే, తాను మినహాగా మిగిలిన యావత్తు ప్రపంచమూ అని ప్రతిమానవుడూ పరిగణిస్తూఉంటాడు. ఇది కేవలము పరమానందయ్యగారి శిష్యుల లెక్కవలె ఉంటుంది. ఆ శిష్యులందరూ ఒక ఏరుదాటిన తర్వాత, ఏటిలో ఎవరైనా కొట్టుకొనిపోయినారేమో అని తమ బృందములో ఉన్నవాళ్లనందరినీ లెక్కపెట్టడం ప్రారంభించినారు. పండ్రెండుమంది శిష్యులు లెక్కతేలాలి. ఒక్కొక్క శిష్యుడు లెక్క ప్రారంభించినప్పుడు తన్ను మినహాగా మిగిలినవాళ్లందరినీ లెక్కించాడు. ఆవిధంగా లెక్కిస్తే 11 మంది మాత్రమే కన్పించారు. ఏ శిష్యుడు లెక్కపెట్టినప్పటికీ, తన్ను మినహాగా మిగిలినవాళ్లను లెక్కించాడు. అదే విధంగా బాహ్యజడ ప్రకృతి అనేమాటకు సాధారణంగా స్థూలంగా ఎవడ్ని అర్థం చెప్పినప్పటికీ, తన భౌతికశరీరమును మినహాగా మిగిలిన జగత్తునే బాహ్యప్రకృతి అంటాడు.

కాని, యిది తప్పులెక్క. మన శరీరం కూడా జడజగత్తులో చేరిన భాగమే. 'ప్రకృతి' అంటే మన శరీరం సంగతి ముందుగా చెప్పాలి. అటుతర్వాత బాహ్య ప్రపంచప్రకృతినిగూర్చి ప్రస్తావించాలి. యీ శరీరంకంటె మనకు అత్యంత పరిచయం గల ప్రకృతిప్రపంచం యింకొకటి లేదు. ఈ శరీరాన్ని ఎక్కువ మక్కువతో పోషించేవాడు పురుషుడు. తత్వవిచారణయందు పురుషుడు అంటే స్త్రీ కూడా అని అర్థం చెప్పవచ్చు. పురుషుడు అంటే యీజీవుడు అని అర్థం చెప్పవచ్చు. ప్రకృతిమీద పురుషునకు ఉండే అనురాగంకంటె మించిన అనురాగం యీ జగత్తులో ఇంకొకటి లేదు.

ఈ శరీరంమీద యీ జీవునకు యింత మోహం, యింత మక్కువ, యింత మమకారం ఉండడం అజ్ఞానమా? అవివేకమా? అవ్యక్తమా? అప్రశస్తమా? అనవసరమా? అసలు యీ అనుమానమే అనవసరం. "శరీరమాద్యం ఖలుధర్మ సాధనం." శరీరాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి. ఎందుకయ్యా అంటే మన శరీరంతో కొంత ధర్మసాధనచేసి ఆ సాధకంద్వారా ఆత్మ పరిపక్వం పొందాలి. "కంజాక్షునర్చించు కరములు కరములు - శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ". "కృతకృత్యా భవితాసి రసనే కృష్ణనామ జపరే" కృష్ణనామజపము చేయుటవల్ల ఓ నాలుకా నీవు కృతకృత్యురాలవగుచున్నావు మార్కండేయులవారు

(55- వ పేజీ చూడండి)

# తిరునాళ్లు

ఏడుకొండలవానికి తలనీలాలిచ్చిన యాత్రికునిలా వెలుగుతున్నాడు చంద్రుడాకాశంమీద. ఆవేళ పౌర్ణమి వెళ్ళిన మర్నాటి పాడ్యమి. రైల్వే ప్లాట్ ఫారంనిండా పాడ్యమీచంద్రులెందరో తీర్థయాత్ర ముగించుకుని పట్నం పోయే రైలుకోసం యెదురుచూస్తున్నారు. శేషావతారం ప్లాట్ ఫారం మీద వెల్లకిలా పడుకున్నాడు తలకింద చిన్న మూట - దాంట్లో ప్రసాదమూ, పువ్వులూ వున్న పొట్లమూ, బట్టలూ వున్నాయి. మూటను నెత్తికిందికి సరిగ్గా సర్దుకుంటూ శేషావతారం ఒక్కసారిగా ప్లాట్ ఫారం అంతటినీ కలియ చూశాడు - స్టేషన్ కెదురుగా వున్న కొట్లల్లో మరచెంబు కొనితెస్తానని వెళ్లిన పురుషోత్తం ఇంకా వచ్చేజాడలేదు. ఇంకా బండిరావడానికి ఒక గంటుంది – మళ్ళీ నిర్మలాకాశంలో కృష్ణపక్ష పాడ్యమీ చంద్రుడికేసి చూడ్కులు నిగుడించాడు - క్రమంగా అతని చుట్టుపక్కల జన సందోహాన్ని ఒత్తిగించుకుని అతని దృష్టిగోళంలో భావ పరంపరలు మబ్బుల్లాగా వస్తూ కమ్ముకుంటూ, మళ్ళీ వెల్తురు చిమ్ముకుంటూ విడిపోతూ, మళ్ళీ చుట్టుపక్కల జనసందోహపు గొణుగులు వినబడుతూ, మళ్ళీ తోసుకుపోతున్నాయి.

ఎందుకు చేస్తారో జనమంతా ఈ యాత్రలు - అన్ని దేశాల్లోనూ అన్ని జాతుల ప్రజలూ చేస్తారా? ఈ ముప్ఫయి మూడుకోట్ల జనంగల పుణ్యభూమాత పుత్రులకు మాత్రమే పుణ్యం కలిగి, మిగిలిన ప్రపంచంలోని ఇతర జాతులకి దీని ప్రమేయం ఎందుకులేదో అని ఆలోచించాడు శేషావతారం. మళ్ళీ ఆలోచనల మబ్బులు విడి పాడ్యమీ చంద్రగోళపు వెలుగులోంచి పక్కనున్న పాశ్చాత్య సోదరుడొకాయన కెమేరాతో ప్లాట్ ఫారంమీద సిద్ధమయాడు. తెల్లవారగట్ల కొండెక్కుతున్నప్పుడు కూడా ఈయన తొందరగా మెట్లెక్కలేక మధ్యమధ్య మజిలీలు చేస్తూ వస్తున్న తన్ను చూసి హెచ్చరిస్తూ మాట్లాడాడు. తన స్నేహితుడు పురుషోత్తం ఆయన కన్నీ ఇంగ్లీషులో బోధపరుస్తూ రావడం, మధ్యదారిలో ప్రాచీన చారిత్రిక రాజధానీ, కొండలోయల్లో సూర్యోదయం, మనోహరదృశ్యాలు ఆయనగారు ఫొటోలు తీయడం, అన్నీ జ్ఞాపకం వస్తున్నాయి - పురుషోత్తం యింకా మరచెంబు కొనుక్కు వచ్చినట్టులేదు - ఆయన మాత్రం ఎవరితోటో మాటాడుతున్నాడు. వాళ్ల దేశాల్లో కూడా ఏవో యాత్రలున్నాయట - మతం పేరుచెప్పి కొన్నీ, చరిత్ర పేరు చెప్పో, భూగోళం పేరు చెప్పో, ఏ కొండో, ఏ అడివో, ఏ నదో, సముద్రపు వొడ్డో ప్రజలు ఆరోగ్యానికీ, విశ్రాంతికీ వినోదానికీ పోయివస్తుంటారట - అయితే మనదేశంలో మిగిలిన అన్ని కారణాలకన్నా మతం కారణంగానే ఎక్కువ యాత్రలుండడానికి కారణంకూడా ఆయన చెప్పిందే జ్ఞాపకానికి వచ్చింది శేషావతారానికి. మీది ఆధ్యాత్మిక దేశం అన్నాడాయన - మీ ప్రజల్లో చాలామంది ఋషులూ, మహాపురుషులూ, మంత్రవేత్తలూ ఉన్నారన్నాడు పురుషోత్తంతో—

## రజని

“అరే, ఈ విషయం మనకీ మొదటినుంచీ తెలుసుగాని, మనం వాళ్లనిగురించి ఆలోచించడమే పళ్లేదే ఇన్నాళ్లనుంచీని” అనుకున్నాడు శేషావతారం. అయినా, పొద్దున్న పురుషోత్తం నోరుజారిపోయి ఒక మాట అనేశాడు ఆపాశ్చాత్యుడితో—‘వాడలా ఎందుకన్నానా’ అనుకుంటున్నాడిప్పుడు—శేషావతారం! “ఋషులూ, మహాపురుషులూ మాట దేవుడికి తెలియాలికాని, బ్లాక్ మార్కెటుదార్లూ, మోసగాళ్ళూ మాత్రం కనిపిస్తారు ఎక్కడపడితే అక్కడ మాదేశంలో”అన్నాడు పురుషోత్తం నోరుజారి! వాడు ఆ మాట అనేసినా, అవతలి పెద్దమనిషి, చాలా మోతాదుగా తొందరపడకుండా ఆలోచించే మనిషి కావడాన్నో ఏమో యుద్ధంవల్ల ప్రపంచంలో ఇంచుమించు అన్ని దేశాల్లోనూ అంతే—అన్నాడు—ఆతర్వాత తను కొంచెం వెనక్కిపడ్డాడు - పురుషోత్తమూ ఆ పాశ్చాత్యుడూ ముందు కొన్ని మెట్లుపైన ఆగారు- పురుషోత్తం భక్తికీర్తన ఒకటి ఎత్తుకుని కీరవాణి రాగం ఆలాపనచేస్తున్నాడు. ఆ విదేశీయుడు వింతగా వింటూండగా - చల్లనిగాలుల కదలికతో అలిసిపోయిన తన కాళ్లల్లో సత్తువ చేకూరగానే, మళ్ళీ, తానూ వాళ్ళని కలుసుకున్నాడు. పురుషోత్తం అసలు తొందరగానే కొండెక్కగలడు -తనమూలాన్ని వెనకాడుతున్నాడుగాని!—ఆ విదేశీయుడు కూడా ఏదో సొంత పద్ధతిని తేలికగానే ముందు ముందుకు పోయి వెనక్కి తమకేసి వింతగా చూస్తుండేవాడు. తను దిగాలుపడిపోయి, ఇంకా నాలుగోవంతైనా ఎక్కందే అన్ని కొండలూ ఎలాగ ఎక్కడంరా అనీ, తలపెట్టిన తర్వాత, మళ్ళీ వెనుదీసేమాట ఆలోచించకూడదనీ నిశ్చయం చేసుకునేలోపల ఆ తెల్లవారుజాము వెన్నెల్లో కొండదారి వంపుల్లోంచి గుంపులు గుంపులు పల్లెప్రజ ముప్ఫయి నలభైయ్యేసిమంది నెత్తిన గంపలూ, మూటలు, బుజాలపైని పిల్లలూ, ముసలీ, పడుచూ, ఆడా మగా, పిల్లా మేకా బిలబిలలాడుతూ భగవన్నామాలు గొంతెత్తి ఉచ్చరిస్తూ తనూ పురుషోత్తమూ అలపు తీర్చుకొనేలోగానే కొండదారి ముప్ఫయి నలభయి మెట్లు దాటి మూడు నాలుగు వంపులు తిరిగి పైపైకి పోతుండేవారు దాంతో వేడెక్కిన ఒళ్లూ, కాళ్లూ కొంత సేదదీరి చల్లగాలి పీల్చుకుని, సత్తువ తీసుకుని మళ్ళీ పైనం సాగించేవారు. ‘ఈ జనం అందరికీ ఎంత పట్టుదలో’ అనుకోవాలో, ‘ఆ దేవుడికి ఎంత ఆకర్షణో’ అనుకోవాలో ఒకపట్టాన తేలలేదు శేషావతారానికి తెల్లవారగట్ల—ఇప్పుడైతే అన్ని సందేహాలూ మబ్బు విడిపోయినట్లు విడిపోయాయి గాని, ఈ పురుషోత్తం ఇంకా మరచెంబు కొనుక్కొని రాలేదు......ఆ పాశ్చాత్యుడు ప్లాట్ ఫారంమీద ఎవరితోనో అంటున్నాడు. పొద్దున్న పురుషోత్తం చెప్పిన మాటలే. “ఈ క్షేత్రానికి అసంఖ్యాకంగా దేశ విదేశ యాత్రికులు రావడం ఈనాడు మాత్రమే కాదూ, పదిపండ్రెండు శతాబ్దాలనుంచీ కూడా ఈ కొండదేవుడి మహిమ తెలిపే చరిత్ర శాసనాలు వున్నాయిట” అనీ, పురుషోత్తం చాలా చెప్పేడతనికి - వాడికి చాలా తెలుసు. ఒక మనిషికే ఇన్ని తెలిసుండడం ఎలా సాధ్యమో – అని అతనికి ఆశ్చర్యం కూడా కలిగింది. అసలు తమ స్నేహితుల్లో ఆశ్చర్యం వేస్తుంది పురుషోత్తానికి ఇన్ని సంగతులు తమకే ఎలా తెలుసా అని-వాడు పుట్టినదాది ఎన్ని క్షేత్రాలు, ఎన్ని దేవుళ్ల



తిరునాళ్ళు దర్శించాడో లెఖ్ఖ లేదు. అన్ని క్షేత్రాల్ని గురించీ, అందరు దేవుళ్ళను గురించీ ఆయా గ్రంథాల్లోని పద్యాలు అవలీలగా ఏకరువు పెడతాడు - ఇవన్నీ చెప్పడమే కాకుండా పురుషోత్తం పలస్తీన్‌లో యాత్రలు, అమెరికాలో నదీ యాత్రలూ, కొండలయాత్రలూ, కొండెక్కడాలు సముద్రతీరాల సెలవురోజులు గడపడం, వీటినిగురించి తను పత్రికల్లో చదివిన విషయాలన్నీ ఆ విదేశీయుడికి పోల్చి చెప్పి, వాటి వివరాలు అడిగేసరికి అతను ఎంతో ముచ్చటపడ్డాడు - కొండెక్కాక తిరణాల జనసమ్మర్దంలో స్నానాలైన వెంటనే గుళ్లోకి వెళ్ళేముందు తానూ పురుషోత్తమూ ఎడమొహం పెడమొహమైపోయారు - ఆ విదేశీయుడు, కెమేరాతో పుష్కరిణివొద్దున ఎగురైఏడీ మీ స్నేహితుడూ అనడిగాడు మబ్బులు విడిపోయి కృష్ణపక్ష పాడ్యమి చంద్రగోళపు అంచుని మళ్లీ స్టేషన్ ప్లాట్ ఫారమూ గానిపైన కెమేరాతో ఆ విదేశీయుడు, తనని చేత్తో తట్టి, "మిస్టర్ - ఏడీ మీ స్నేహితుడూ" అనడిగాడు. శేషావతారం కళ్లు నులుంకుంటూ లేచి, "మరచెంబు కొనుక్కొని వస్తానని - ప్లాట్ ఫారం బైటికి పోయాడు" - అన్నాడు - ఆ విదేశీయుడు "ఏమిటి ? పొద్దున్న పుష్కరిణి వొద్దున ఎదురై అడిగినప్పుడు జనంలో పోయిందని వెతుక్కుంటూ వచ్చాడు కాదూ - ఇంకా దొరకనే లేదన్న మాట" ఆ వృత్తాంతమంతా, ఆయన పక్కని తనతో మాటాడుతున్న పరిచితోద్యోగితో చెపుతున్నాడా విదేశపాయన. కొండలన్నీ యెక్కి తిరునాళ్ళలో మునుగుని మునుగుని, తర్వాత తిరిగి తిరిగి అలిసిపోయిన శేషావతారం మరచెంబు కథ వింటూ వింటూ మళ్ళీ చంద్రగోళంలో పడ్డాడు. చంద్రగోళం అంతా పెద్ద పుష్కరిణిలా వుంది. చుట్టూ యాత్రికులు స్నానాలు చేస్తున్నవారు స్నానాలు చేసి, గుళ్లోకి వెళ్లేవారూ వచ్చేవారూను. తను పురుషోత్తంకోసం వెదుకుతున్నాడు. పుష్కరిణి మధ్య మంటపం - పుష్కరిణి చుట్టూ - ఆలయపు గోడపైని శిల్పఋషులు వారి భుజాలపైని వెళ్లాడుతూ కోతులు - ఒక యాత్రికురాలి భుజంమీగి రాగిచెంబు లాక్కుని - ఒక కోతి ఆ ఋషీశ్వరుడి నెత్తిమీద పెట్టుకుని కూచుంది - ఆ అమ్మాయి తెప్పతిరునాళ్లకి దేవుడా పుష్కరిణికి వచ్చినప్పుడిద్దామని అరటిపళ్ళు ఆ రాగిచెంబులో పైకి కనబడేలాగ పెట్టుకుంది, పాపం - హనుమంతుడు ఇష్టపడిం తర్వాత ఆయనగారికి దొరికితే తిరిగి ఇస్తాడా! - మరచెంబు కనబడలేదని వెతకడానికి పోయిన పురుషోత్తం ఇంకా రాలేగ. ఆ అమ్మాయి బంధువులూ - పిల్లలూ ఆ కోతిని - నయానా భయానా బెదిరించి - చూస్తున్నారు చెంబు పడేస్తుందా లేగా అని! - ఉత్సవం వచ్చేస్తోంది - స్వామీ అమ్మవారూ పీతాంబరాలు ధరించి, ధగధగ మెరిసే కిరీటంతో నవరత్నాలు తళుకు తళుక్కనే నగలతో దేదీప్యమానంగా వస్తున్నారు! మల్లే, కనకాంబరం, బంతి, చేమంతీ, మరువం, దవనం, అన్నీ కదంబంగా అల్లిన తెప్ప - ఆ తెప్పలో మంత్ర పురస్సరంగా లోకేశ్వరుడూ, లోకమాతా ఆసీనులయారు! - భగవన్నామస్మరణతో భువనాంతరాలు ప్రతిధ్వనించాయి.

ఆయన పురుషోత్తముడూ ప్రకృతి శ్రీ మహాలక్ష్మి అని కొండెక్కుతూంటే విదేశీయ యాత్రికుడితో పురుషోత్తం చక్కగా వివరించి చెపుతున్నాడు ఏరీ వాళ్ళిద్దరూ ఎక్కడ? మరచెంబు దొరికిందా? - చంద్రగోళపు అంచులు కరిగి ప్లాట్ ఫారంమీద విదేశీయుడు పరిచితోద్యోగితో ఆడుతున్న మాటలు వినబడుతున్నాయి. 'ప్రకృతి, పురుషుడు', 'పరమాత్మ, జీవాత్మ', అనే మాటలు ఆ ఉద్యోగి తిరిగి తిరిగి బోధిస్తు



# తిరునాళ్ళు



న్నాడాయనకు - శేషావతారం జీవాత్మ తన భౌతిక శరీరంలో కొస్త ఇటు వత్తిగిల్లి, అటు వత్తిగిల్లి నోరు తడిచేసుకుని మళ్ళీ వెల్లకిలబడింది. చంద్ర పుష్కరిణి - ముఖ మంటపంవైపు వేదమంత్ర ఛ్ఛాటనతో మెల్లమెల్లగా పయనిస్తున్న ఆదిదంపతుల పూలనావ - శేషావతారంచేతు లప్రయత్నంగా కలుస్తాయి. ఎంత సగుణరూపాన్ని చూసినాకూడా దైవసన్నిధిని కన్నులప్రయత్నంగా మూతలేపడుతా యెందుకో! - ఎదుట దైవప్రతిమూర్తి సగుణాకారములో సాక్షాత్కరిస్తున్నా కూడా ఎందుకో ఈ కనుమూత? తన కర్థంకాలేదు. గర్భగుడిలో ధర్మదర్శన వేళా అంతే—పురుషోత్తం అయితే ఇలాటి సందేహాలకి త్వరత్వరగా సమాధానా లిచ్చేస్తాడు. "మన దేశంలో బుద్ధిజీవులైన తపస్వులకు మహాఋషులకు, నిర్గుణాకార పరబ్రహ్మమును మానసికంగా ఉపాసించడం అవలంబనీయమని బోధించారు. ఆవిధంగా మానసికంగా ఉపాసించదగిన సునిశిత ధారణాశక్తులులేని సామాన్య పామరజనం కంటెదుట అలంకృతమైన దివ్యసుందర విగ్రహామూర్తులను అర్చిస్తారు! మా శేషావతారంలాంటి మన్యతరగతిమనిషి ఇటు పూర్తిగా పండితుడూ అటు పూర్తిగా పామరుడూ కాలేక, ఎదురుగా భగవంతుని దివ్యసుందరవిగ్రహాము పెట్టుకొని కళ్ళు మూసుకొనె చేతులు జోడించడం పరిపాటి" —అని. —ఇదే సందేహం వచ్చిన విదేశీయ యాత్రికుడికి పురుషోత్తం బోధించాడు గర్భగుడివద్ద. ఇది అతనికి నచ్చినట్లే ఉంది. చంద్రగోళం కరిగి - ప్లాట్ ఫారమ్ మీద కూచున్న విదేశపాయన ఆపక్క పరిచితోద్యోగితో సగుణోపాసన, నిర్గుణోపాసన అని ఆవిషయాలే చెబుతున్నాడు - ఇంతలో సెకండ్ బెల్ అయింది!-ఒకళ్లిద్దరు పోర్టర్లూ, ప్లాట్ ఫారంమీద పచారు చేస్తున్న కొందరు యాత్రికులూ ప్లాట్ ఫారపు అవతలికొసవైపు మెడ్కలు నిగిడించి చూశారు: మెల్లగా కదుల్తూన్న కృష్ణపక్షపాడ్యమి చంద్రుడులాగ ముందు దివ్వటి దీపంతో స్టేషన్కి కొన్ని ఫర్లాంగుల దూరంలో నె వస్తున్న రైలుబండిని! కొండ మెట్లన్నీ ఎక్కి దిగి, తిరునాళ్లు అవుతున్నంతసేపు గుంపులో నుంచుని తిరిగి తిరిగి అలిసిపోయిన యాత్రికుడిలాగ మెల్లిగా రొజుకుంటూ వస్తూన్న రైలుబండిని చూశారు జనమంతా! - ఎక్కణ్నుంచో ప్లాట్ ఫారం కటకటాలనీ, జనాన్నీ దూసుకుంటూ తారాజువ్వలాగ పరుగున వొగర్చుకుంటూ పురుషోత్తం వచ్చిపడ్డాడు మరచెంబుతోటి! శేషావతారం తలకిందిమూట చేత పుచ్చుకుని లేచినిలబడ్డాడు-బండివచ్చి ప్లాట్ ఫారంపైని ఆగింది. యాత్ర పూర్తి చేసుకుని కొద్దో గొప్పో పుణ్యం మూట కట్టుకున్న తైర్థికులంతా రైల్లో చోటు కోసం కిందా మీదాపడి తోడలు తొక్కుకున్నారు. శేషావతారమూ, పురుషోత్తమూ మూటలతో మరచెంబుతో ఎలాగైతేయే

(౫౬-వ పేజీ చూడండి)

# ★ కర్మసిద్ధాంతులు ★

## కొడవటిగంటి కుటుంబరావు

ఈ కాలంలో పదిమంది బంధువులొకచోట కూడటమంటే అది కేవలం దైవికంగా జరగవలసిందే గాని మానవయత్నంవల్ల జరిగే విషయమా? అందులోనూ మాది చాలా పెద్ద బలగం. మా తాతయ్యకు ఆరుగురు కొడుకులూ, అయిదుగురు కూతుళ్ళూనూ. మాతరంవాళ్లం ఇరవై అయిదుగురం ఉన్నాం. అందులో ఇంటిపేర్లు మార్చేసుకున్న పదముగ్గురు ఆడపిల్లల్ని మినహాయించినా పన్నెండుమందిమి ఉన్నాం. మాతరవాత అప్పుడే ఒక తరం తయారయింది. చెప్పొచ్చిందేమంటే మా బలగం చాలా పెద్దది. అయితేనేం? నామటుకు నేను అయినవాళ్ళను చూసి దాదాపూ అయిదేళ్లయింది. మా రాముడు బావా, రాఘవులన్నయ్యా ఢిల్లీలో వున్నారు. ఉమాపతి బొంబాయిలో ఉన్నాడు. సుబ్రమణ్యం కలకత్తాలో ఉన్నాడు. కృష్ణమూర్తి బెంగుళూరు బదిలీ అయాడు ఈమధ్యనే. కాంతారావు విశాఖపట్నంలోనే ఉంటున్నా ఎవరికీ ఉత్తరముక్క రాయడుగదా. శ్రీనివాసులు సికింద్రాబాదునుంచి పుష్కరానికోసారిగాని బయలుదేరడు. వాడికి పిల్లలు పుడుతున్నారు, పెళ్లిళ్లయి అత్తవారిళ్ళకూడా పోతున్నారు. వాళ్లని మేం చూస్తేకూడా గుర్తుపట్టలేం. ఇదంతా చెప్పుకుపోతే మహాభారతమంత గాథ అవుతుంది. పరిస్థితి బోధపడుతూనే ఉంది కాదూ?

నిజానికీ విచ్ఛిత్తి మా తాతయ్య బతికుండగానే ప్రారంభమయింది. మా పెద్ద పెదనాన్న సూరయ్యగారు దారితీశాడు. ఆయన రంగూనుకు బయలుదేరిన మరుసటి ఏడు కాబోలు మా రెండో పెదనాన్న చదువు వంకపెట్టి కలకత్తాకు బయలుదేరాడు. మా నాన్న పెళ్ళి కాగానే మద్రాసుమీద ఆశలు పెట్టుకున్నాడు; ఎంగుకంటే మా రెండో మేనమామ మద్రాసులో ప్లీడరు ప్రాక్టీసు పెట్టి, మద్రాసులో వ్యాపారం పెట్టమని మా నాన్నకి పురెక్కించాడు. మా నాన్న తరవాతవాళ్లు ముగ్గురూ మా తాత బతికుండగా కదలలేదు.

అప్పటికీ మా తాత ఒక్కటి మాత్రం సాధించగలిగాడు. ఏటా ఆయన దేవీ నవరాత్రులకు కళశం పెట్టేవాడు. ఆ సమయానికి ఎక్కడెక్కడ ఉన్నవాళ్లూ కొంప చేరుకోవలసిందే. ఆ పది రోజులూ ఇల్లు మహావైభవంగా ఉండేది. రకరకాల వయసులుగల ఆ ఆడమగమూకను చూసుకుని మా తాత చాలా సంతోషించేవాడు. "నేను దేహం విడిచేనాటికి అందరూ నా చుట్టూ ఉండితీరవలసిందే," అని ఆయన అనేవాట్ట. మొత్తానికి అంతపనీ చేసి ఆయన, నేను పదేళ్ళవాణ్ణయి ఉండగా నవరాత్రుల్లోనే పోయాడు! జాతకమంటే ఆయనదీ.

జాతకమంటే జ్ఞాపకం వచ్చింది. మా సుబ్బయ్య బాబాయి గొప్ప జ్యోతిష్కుడు. నాకు జ్యోతిషంలో అంత నమ్మకం లేదు. కాని ఆయన చెప్పినవి చాలా జరిగాయి. ఇది తెలిసిఉండటంవల్లనే నేను జ్యోతిషాన్ని పూర్తిగా కొట్టెయ్యలేను. కలకత్తా యూనివర్సిటీలో బియ్యే పాసయిన మా శేషగిరి పెదనాన్న 1930 లో చచ్చేఖాయిలా పడ్డాడు. ఆయన తిరిగి కోలుకుంటాడని ఎవరూ అనుకోలేదు. మా సుబ్బయ్యబాబాయి ఆయన జాతకం చూసి, "నీకు 1935 దాకా ఏమీ ఢోకా లేదు. తరవాత సంగతి చూసుకుందాంలే," అని చెప్పేశాడు. శేషగిరిగారు మళ్ళీ లేచి తిరిగాడు. 1935 మే నెలలో వడదెబ్బ తగిలి కాదూ ఆయన పోయిందీ? ఇటువంటివి కళ్ళారా చూసికూడా జ్యోతిషంలో ఏమీ లేదనటం ఎట్లా?...తొందరపడకండి. మీరనబోయేది నాకూ తెలుసు. నేను మీతోనూ ఏకీభవిస్తాను. రాసిపెట్టిఉంటే భోజనం చెయ్యలేకపోతామా అని ఎవరమూ హాయి రాజైయ్యకుండా ఉండటంలేదు. కార్యకారణ సంబంధం ప్రత్యక్షంగా చూస్తూనేఉన్నాం. ఫలాని రోగాలకు ఫలాని మందులిస్తున్నాం. దేశంలో సమృద్ధి ఉంటే జాతులు బాగుపడుతున్నాయి, లేకపోతే పురుగు ముట్టిపోతున్నాయి. అంతా నాకు తెలుసు, కాని...

అసలు విషయం మరిచాను. కిందటి మార్చిలో తలవని తలంపుగా—దైవికంగా అనికాదూ అన్నానూ?—ఈ విసిరిపారేసిన బలగంలో పాతికమందిమి ఒక్కచోట కలిశాం. ఏ కార్యకారణసంబంధంవల్ల కలిశామో నాకు తెలిస్తే చెబుదును. కాని నాకు తెలీదు. కొందరికి కబుర్లు వెళ్ళినమాట నిజమే. కాని మరికొందరు అనుకోకుండానే తటస్థపడ్డారు. అన్నిటికన్నా ముఖ్యమేమంటే మా సూరయ్య పెదనాన్న కూడా అక్కడికి చేరాడు. మా కుటుంబాలకు మా తాత తరవాత తాత అంతవాడు, మీదుమిక్కిలి రెండు మూడు లక్షల ఆస్తి గడించుకున్నవాడు, ఆయన వచ్చాడని చూడవచ్చినవారు లేకపోలేదు. (వచ్చినందుకు వట్టి చేతులతో తిరిగి వెళ్ళలేదులెండి.)

పెద్దలూ పిన్నలూ అంతా ఒకరాత్రి భోజనాలై డాబామీద కూర్చున్నాం. వెన్నెలకూడా ఉంది. మా పెదనాన్న చుట్టూ సుబ్బమ్మత్తయ్య, శంకరం మామయ్యా, శేషమ్మపిన్నీ, సుబ్బయ్య బాబాయీ, నరిసింహం బాబాయీ, ఇంకా ఇతర పెద్దలూ ఉన్నారు. ఇంతమందీ చేరాక కష్టసుఖాలూ, మంచిచెడ్డలూ రాకుండా ఉంటాయా? కుటుంబాల మధ్య కలహాలొచ్చాయి, కుటుంబాలు చితికిపోయాయి, హెచ్చుతగ్గులవిచక్షణలొచ్చాయి, అయినవాళ్ల కివ్వకా చేసుకోకా పెళ్ళి సంబంధాలకు ఇతర్రతా వెళ్ళారు. వారు ఇదనీ, వీరు అదనీ అరోపణలు బయల్దేరాయి. కొందరు కొందర్ని సమర్థించారు, మరికొందరు మరికొందర్ని వెనకేసుకొచ్చారు. కుర్రకారులో అనేకమందికి ఈ పెద్దలేం మాట్లాడుతున్నదీ తెలిసేది కూడా కాదు.

"ఒరే, ఇవన్నీ ఎందుకురా? నాకు అరవై దాటాయి. నా అనుభవం కొత్త వింటారూ?" అన్నాడు మా పెదనాన్న. అందరూ సద్దుమణిగారు. "నేను సమర్థుణ్ణా? అసమర్థుణ్ణా? ఎవరన్నా చెప్పగలరూ?"

"ఎంత సమర్థుడివి కాకపోతే రెండు చేతులా అంత డబ్బు గడించావు, బావా?" అన్నాడు మా శంకరం మామయ్య.

"అది అబద్ధం!" అన్నాడు మా పెదనాన్న. "చిత్తశుద్ధిగా చెప్పాలంటే— నేను బతికుండగా ఇంతమందిమి మళ్ళీ కలుస్తామో లేదో నాకే తెలీదు—నాప్రయోజ

#  కర్మసిద్ధాంతులు 

కత్వం ఏమిటో నేనే చెప్పలేను. నేను వ్యాపారం చేశాను. బాగా లాభం తీస్తా ననుకున్నచోట నష్టం వచ్చింది. ఉట్టుడియంగా అవకతవకగా చేసిన వ్యాపారంలో చచ్చే లాభం వచ్చింది. ఇంకోటి చెబుతా, నేను చచ్చిబతికినన్నిసార్లు మీ రెవరూ చచ్చిబతికుండరు. ప్రతిసారీ నా కొకటే అనిపించేది: ఎవరో ఎందుకో నన్ను చావకుండా కాపాడుతున్నారని! చెబితే అతిశయోక్తిగా తోస్తుందేమో గాని నాకిప్పుడు చావుభయం లేదు. డబ్బు పోతుందనే భయం లేదు. నా జీవితానికి నేను కర్తను కానననే నమ్మకం కుదిరిపోయింది. ఏనాడో నన్ను చావు మళ్ళీ సమీపిస్తుంది. నాకూ చావుకూ మధ్య ఎవరూ అడ్డుపడరు. దాంతో నా జీవితం చెల్లు! మీ కెవరికీ బహుశ తెలీదు. కిందటి యుద్ధమప్పుడు బర్మాలో నా డబ్బు చాలా పోయింది. నాకేమీ విచారం కలగలేదు. మిడుముక్కలి ప్రాణాలు పోగొట్టుకుంటున్న వాళ్ళను చూస్తూ, 'ఈ నాటకానికి అర్థం ఏమిటో?' అని ఆశ్చర్యపడ్డాను. గొప్ప చదరంగం ఆటనుగురించి చదరంగప్పావుకు ఎంత తెలుసో నాకూ జీవితంగురించి అంతే తెలుసు."

ఆయన ఈ మాట లంటుంటే అందరూ గంభీరంగా అయిపోయినారు. పనికిమాలిన వేదాంతం వినేటప్పుడు మనుషు లావిధంగా అయిపోవటం నేను చాలాసార్లు గమనించాను.

"కాక మరేమిటి? అంతా ఖర్మ. మనం దేనికీ కర్తలం కాము," అన్నది శేషమ్మ పిన్ని. అయిదు నిమిషాల క్రితం ఈవిడే తన కూతుర్ని శంకరం మామయ్య కొడుక్కి చేసుకోలేదని తెగ దెప్పింది.

ఒకళ్ళ తరవాత ఒకళ్ళు వ్వూ పెదనాన్నతో ఏకీభవించి ఆయన మాటలలో ఉన్న — ఉన్నదని కనీసం వాళ్ళనుకున్న — కర్మ సిద్ధాంతాన్ని గట్టిగా బలపరచసాగారు.

మానవ యత్నానికి దమ్మిడీ విలువ ఇవ్వనందుకే మా పెదనాన్నమీద నాకు కొంచెం చిరాకుగా ఉంటే ఆయనతో ఏకీభవించే ఈ ముచ్చులమీద చెప్పరాని క్రోధం కలిగింది.

"అది కాదు, పెదనాన్నా. నీకేం కోరికలు లేవా? వాటిని తీర్చుకోవటానికి నువు ప్రయత్నం చెయ్యటంలేదూ?" అన్నాను.

"ఒరే నువు రైళ్ళలో ప్రయాణం చేశావు గదా. రైలు తనదారిన అది పోతుంటే పెట్టెలో నీకు తోచినట్టు నువూ తిరిగి ఉంటావు. కాని రైలు నడకకు నువు కట్టుపడిలేవూ? దాని పోకడతో పోలిస్తే నీదొక పోకడా? నీయిష్టం వచ్చినచోటికి నువు పోతున్నా వనటంలో అర్థం ఉందా?" అన్నాడు పెదనాన్న.

"బాబాయి జ్యోతిషంలో నీకూడా పూర్తినమ్మకం ఉందన్నమాట" అన్నాను. "అంతా రాసి పెట్టి ఉందంటావు?"

"రాసిపెట్టి ఉండటమనేది నమ్మకపోవటం ఒక మూఢవిశ్వాసమైపోయింది ఈ కాలపువాళ్ళకు. పుట్టినజీవి చచ్చిపోతుందని రాసి పెట్టిలేదూ? ఆడవాళ్ళే పిల్లల్ని కనాలని రాసి పెట్టిలేదూ? మనుషులకు ఏ డెనిమిదేళ్ళప్పుడు పళ్లూడిరావాలనీ, మగవాళ్లకి యవ్వనంలో గడ్డాలూ మీసాలూ రావాలనీ రాసి పెట్టలేదూ? వాటిని నమ్మటం తప్పు లేదేం?" అన్నాడు పెదనాన్న.

"అది వేరు. అదంతా శాస్త్రవిజ్ఞానం," అన్నాను.

"సుబ్బయ్య చెప్పే జ్యోతిషం శాస్త్ర విజ్ఞానం కాదని నిరూపిస్తావా? అసలు శాస్త్రవిజ్ఞానం ఏది అవునో ఏది కాదో నీకు తెలుసునా? జియోలజీ శాస్త్రం కాదన్నారు. బయోలజీశాస్త్రం కాదన్నారు."

"అవి శాస్త్రాలనిపించుకున్నాయి ఒకనాటికైనా. జ్యోతిషం అట్లా కాదే. వంద జాతకాలు చూసి బాబాయి ఎంతమందికి సరిగా చెప్పగలడు? ఎన్ని విషయాలు సరిగా చెప్పగలడు?"

"బాబాయి ఒక్కడే జ్యోతిషానికి అధిపతా? ఒక డాక్టరు వంద కేసుల్లో మూడే నయం చేసినంతమాత్రాన వైద్యం శాస్త్రం కాదంటావా? ఒక ఎలోపతీ వైద్యమే శాస్త్రమంటావా? ఎందుకంటే అరడజను మంది ఎలోపతీవాళ్లు నయం కాదన్న కేసు చటుక్కు వైద్యంతో కుదరగా నేను చూశాను."

"నువు చాలా చూశావు. అందుకే నీతో వాదించడం కష్టం," అన్నాను.

"పిచ్చివాడా ఇది వాదించే విషయం కాదు. ఇంత పెద్ద సృష్టికి మనిషే నియంత అనుకున్నంత కాలమూ తప్పుదారినపడటం చాలా సులభం. మనిషిని మించిన శక్తులు జగత్తును నడిపిస్తున్నాయన్నది అనుమానం తగిలినాక నీ వైఖరి మారితీరాలి. మాట వరసకి చెట్లు మనుషుల సేవా ళ్ళున్నారని పని కట్టా యనుకో!"

అనుకున్నాను. అనుకుని ఆశ్చర్యపడసాగాను. కాని పెదనాన్నతో పూర్తిగా ఏకీభవించనూ లేదు, బొత్తిగా ఏకీభవించకనూ పోలేదు.

మా సంభాషణ ఇంకెంతదూరం సాగేదో ఇంతలో మా నరసింహం బాబాయి దత్తపుత్రుడు చంద్రం వచ్చాడు. వాణ్ణి చూడగానే అందరూ అంతో ఇంతో బిగదీసుకుపోయారు. ఎందుకంటే వాడు కమ్యూనిస్టు. ఈమధ్య రెండేళ్లు అండర్ గ్రౌండ్‌లో ఉండి బయటికొచ్చాడు. వాడికీ తండ్రికీ మాటలు లేవు. మా బలగానికి చాలా మచ్చలున్నాయి. దొంగతనాలు చేసి ఖైదు అయిన వాళ్ళున్నారు. దొంగవ్యాపారం చేసి జరిమానా లిచ్చుకున్న వాళ్లున్నారు. తాగుబోతులూ, వ్యభిచారులూ కూడా ఉన్నారు. కేసులలోనూ, పేకాటల్లోనూ సర్వస్వం పోగొట్టుకున్న వాళ్లున్నారు. కాని అన్ని మచ్చలనూ తలదన్నిన మచ్చ చంద్రం. మా బంధువులలో చాలామంది దృష్టిలో చంద్రం హంతకుల జాబితాలో వాడు, దేశద్రోహుల జాబితాలో వాడు, విదేశీయుల ఏజెంట్ల జాబితాలో వాడు.

పెదనాన్న చంద్రాన్ని చూసి గుర్తుపట్టినట్టు లేదు. ఇంకెవరూ వాణ్ణి పరిచయం చెయ్యరని తెలిసి నేనే పరిచయం చేశాను.

"ఓహో! వీణ్ణి నేను ఆరేళ్ల క్రితం చూశా. బాగా పెరిగాడు," అన్నాడు పెదనాన్న.

"వాడిప్పుడు కమ్యూనిస్టు. మిట్టపల్లాలేకం చేసి, వర్గరాహిత్యం సాధించి సామ్యవాదం నిలబెట్టేటందుకు జీవితం అంకితం చేస్తున్నాడు," అన్నాను.

"మన వెంకయ్యగారు వున్నారు చూశావ్ - ఆయన బంగారంలాంటి మనిషిఅనుకో. అరవై ఏళ్ల జీవితంలో ఆయన ఈ చిన్న పాపం చేశాడని అనటానికి వీల్లేదుకదా?"

"అలాగా? - ఐతే యింకెవరినిగురించైనా మాట్లాడుదాం"

"అట్లాగా?" అన్నాడు పెదనాన్న.

ఆయనవంటి ఆస్తికుడు చంద్రం వంటి నాస్తికుణ్ణి గురించి అంతకంటె ఏమీ అనక పోవటం నాకే నిరాశ కలిగించింది. పెదనాన్న ఇంతకుముందు అంటున్న మాటలకు ఎదురు వాదించవలిసిన అసలు మనిషి చంద్రం.

"పెదనాన్న కర్మసిద్ధాంతం చెబుతున్నాడురా, చంద్రం! మనచేతిలో ఏమ్మీ లేదుట. మనమంతా భగవంతుడి చేతి కీలుబొమ్మలంట; అన్నాను.

చంద్రం వెటకారంగా నవ్వాడు.

"ఎంత మంది నెత్తిన చెయ్యిపెట్టి అంత డబ్బు సంపాదించాడో! తన చేతిలో ఏమీ లేదనక, తానే ఆ అన్యాయమంతా చేశానని ఒప్పుకుంటాడా?" అన్నాడు చంద్రం.

దానికూడా పెదనాన్న ఏమీ మాట్లాడలేదు. మరో అయిదునిమిషాలు కూర్చుని చంద్రం వెళ్ళిపోయినాడు. ఆ అయిదునిమిషాలూ కూడా ఎవరిలోనూ ఏమీ చైతన్యంలేదు. ఎవరిమటుకు వాళ్లు స్తంభించిపోయారు. ఆఖరుకు పెదనాన్న కూడా స్తంభించినట్టే కనబడ్డాడు.

కాని చంద్రం వెళ్ళిపోగానే తిరిగి అందరిలోనూ చైతన్యం వచ్చింది. కొద్దిమందిలో కాస్త మోతాదుకు మించికూడా వచ్చింది.

"దొరక్క దొరక్క నరిసింహానికి వీడు దొరికాడు చూడు!"

"ఈ కమ్యూనిస్టులంతా ఒకటే మచ్చు. పెద్దా, పిన్నా, దేవుడూ, దైవం, మంచీ, చెడ్డా విచక్షణే లేదు. చెదపురుగల్లే చేరిన చోటల్లా నిర్మూలనం సాగించి వదిలిపెడతారు. వీళ్ళ బతుకు చెడా!" అన్నాడు శంకరం మామయ్య.

అయిదు నిమిషాల్లోపల అందరూ తలా ఒకటీ అన్నారు. పెదనాన్న వాళ్లకేసి అదో మాదిరిగా చూడసాగాడు. ఆయన ఏమీ అనకపోవటం చూసి నేను ఆయనను కదిపించాను.

"ఏం, పెదనాన్నా? నువు కమ్యూనిస్టులను తిట్టేవాళ్లతో ఏకీభవించవా ఏమిటి?" అన్నాను.

"ఎందుకు వాళ్లను తిట్టటం?" అన్నాడు పెదనాన్న.

అందరూ ఆయనకేసి వింతగా చూశారు.

"ఈజీవితనాటకంలో భగవంతుడు వాళ్లచేత చాలా పెద్దపాత్ర ధరింపజేస్తున్నట్టు నాకు కనిపిస్తోంది. చరిత్రలో వాళ్లు నిర్వహించే పాత్ర చూస్తున్నాను. భగవంతుడు వాళ్లకి కలిగించే ప్రేరణలు చూస్తున్నాను. వాళ్లకి విరుద్ధంగా సంఘటితపడే బలవత్తర శక్తులను చూస్తున్నాను. ఇందాక నువ్వు మన కోరికలనుగురించీ అవి తీర్చుకునేటందుకు మనం చేసే యత్నాలుగురించీ మాట్లాడావే! ఈ కమ్యూనిస్టుల కోరికలూ, వాటిని తీర్చుకునేటందుకు వారు చేసే యత్నాలూ చూస్తే నా బుద్ధి ఒక్కొక్కసారి దిమ్మరపోతుంది. కమ్యూనిస్టులను గురించి హేయంగా భావించటానికి నాకేమీ కారణం కనిపించలేదు" అన్నాడు పెదనాన్న.

అక్కడ ఆ క్షణాన ఉన్నవారిలో ఒక్కరైనా ఆయనను సమర్థించటానికి ముందుకు రాలేదు.

"అయ్యో, పెదనాన్నా. ఇక్కడ కర్మసిద్ధాంతం మాట్లాడేవాళ్లు చాలా మంది ఉన్నారు గాని, నిజమైన కర్మసిద్ధాంతివి నువ్వొక్కడివే కనిపిస్తున్నావు!" అనేశాను. ★

## తా దూర వీలులేదు మెడ కొక డోలు!






సీరియల్

"శారద"

## 26

భాస్కర్రావు ఒక్కొక్కరాత్రి సుందరయ్యగారింట్లోనే పడుకుంటున్నాడు. ఆ రాత్రుల్లు పద్మ తీరికగా తడికవాకిలి దగ్గరచేరి ఎదురింటి కిటికీవంక చూస్తుంది. అక్కడ డాబాలో స్టూడెంటు, పద్మ తనవంక చూస్తున్నదని అతి సూక్ష్మబుద్ధితో గ్రహించాడు. గ్రహించింది లగాయతు అతనికి వంట్లో వంకర లెక్కువైనాయి. పాటలూ జాస్తి అయినాయి. వాటి దుంపతెగ, అన్నీ ప్రణయగీతాలే. సినిమాలో డ్యూయెట్లుగావును, బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ గూడా వాడే మధ్యమధ్య పాట ఆపి—ఢుంయ్ ఢుంయ్—అనడం. నాలికతో ట-ట-త-త అని తాళం.

ఆ పాటలు పాడేప్పుడు చూస్తుంటే పద్మకి వాణ్ణి చంపుదామా అన్నంత కోపం వస్తుంది. ఏం గొంతు! ఏం పాట! వాణ్ణి చంపుదాం అని వచ్చే శత్రువులుగూడా ఆ పాటవిని పారిపోతారు! ఒకనాడు రాత్రి 8 గంటల ప్రాంతాల పద్మ భోంచేసి వాకిట్లో కూర్చుంది.

డాబాలోవాడు ఆవేళ ఏదో విరహగీతం అందుకున్నాడు, వెన్నెట్లో డాబామీద కూర్చుని. వెన్నెల పిండారబోసినట్టుంది. ఒకరికొకరు స్పష్టంగా కనిపిస్తున్నారు. ఎట్లాగో అరగంట పాట మూలిగి విరమించేడు అతను—"దయలేదా నామీద" అని గుడ్లు తేలేసి నాలిక చప్పరించి. పద్మకి జాలివేసింది. నవ్వు వచ్చింది. చివరికి ఇవేమీ పనిచెయ్యవనుకున్నాడు కాబోలు, అతను జేబులోనుంచి పదిరూపాయల కాయితం తీసి టపటప లాడించాడు. పద్మ, ఒక నిమిషం ఆలోచించింది. వ్యతిరేక భావాల్ని బలవంతాన అణగద్రొక్కి ప్రాణాలు బిగబట్టుకుని "రా" అన్నట్టు చేత్తో సౌంజ్ఞచేసింది. ఆమె సౌంజ్ఞ చేయడంతోనే వాడి వొళ్లు సవాలక్ష వంకరలతో మెలితిరిగిపోయింది. డాబా పిట్టగోడమీంచి కిందపడేంతపనైంది. చేతిలో పుస్తకం దభేలుమని రోడ్డుమీదికి పడిపోయింది, వొణుకు ఎక్కువై.

ముసలమ్మ నిద్రపోయిందాకా పద్మ కాచుకు కూచుంది. ఈలోగా—కడుపులో ఆందోళన ఎక్కువ అవుతోంది. పక్కనే పదిరూపాయల ఆశ విశ్వరూపందాల్చి కనపడుతోంది. డాబావాణ్ణి చూస్తే, వాడి పాటవింటే ఆమెకి తగని అసహ్యంగావుంది అయితే ఆమెలో శారీరక వాంఛలు నశించాయనికాదు. ఆకలి, శరీరవాంఛలు రెండూ, రెండువైపులా ప్రబలమై ఆమెను దుర్వృత్తికి ప్రోత్సహిస్తున్నాయి వాటికి లొంగిపోవడంతో, అవతల వాడు ఎవడైతేఏం అన్న నిర్లక్ష్యం, నిరసన భావాలు వచ్చేశాయి. పదిన్నరదాకా, మేలుకుని కూర్చుంది, భాస్కర్రావు వస్తాడేమోనని. అతను రాకపోతే...బాగుండును అన్న భావం కలిగిందామెకి. ఎదురింటి విద్యార్థి తన గదిలో లాంతరు పెద్దదిచేసి పుస్తకం ముందేసుకుని అలాగే మేకల్లే కూర్చున్నాడు. పద్మ అతన్ని నిదానించి చూసింది. అతడి క్రాపు చెరిగి నుదురుమీద పడుతోంది. బక్కపల్చగా వున్నాడు. ముక్కూ నోరూ ఆ కోల మొహంమీద అతికించినట్టున్నాయి. చామనచాయ, లాల్చీ మోకాళ్ళదాకా వేళ్ళాడుతోంది. బిళ్ళ గోచీపంచె కట్టాడు. కళ్ళజోడుగూడావుంటే ఏ భావకవికైనా సరిపోలుతాడు.

పదకొండయింది. వెన్నెల బాగా తెల్లగా వెలుగుతోంది. ఆ సందులో సందడి అప్పటికి పూర్తిగా తగ్గిపోయింది. ఒకటి రెండు కుక్కలు దూరాన ఎక్కడో మొరుగుతున్నాయి. అతను లేచి వాకిటిదగ్గిరకువచ్చి పద్మని పిలుస్తున్నాడు సౌజ్ఞలతో. పద్మ చల్లగా లేచింది. తడిక బైటికిలాగి గట్టిగా కట్టేసింది. ఇంకో ఆరుగంటల సేపటవరకూ ఆమె కేమీ ఫర్వాలేదు ముసలమ్మ తెల్లారి కట్టగాని లేవదు అందాకా ఆమె ఆ డాబాగదిలో వుండొచ్చు. ఆమె కొంగు బాగా ముసుగు వేసుకుని, అటూ ఇటూ చూసి ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని, ఆ యువకుడున్న వాకిలిదగ్గిరికి చకచక నడిచివెళ్ళింది. అతను వెంటనే ఆమెను లోపలికి లాక్కుని తలుపు గభీమని వేశాడు.

## 27

భాస్కర్రావు ట్యూషన్ వల్లా కొట్లో పనిచేసీ సంపాయించే డబ్బును మామూలుగా మేనత్తచేతి కిస్తాడు. భాస్కర్రావుకి ఆదివారాలు తప్ప తీరిక ఉండకపోవటంతో అతను వెళ్లలేడు. మేనత్తే బజారు వెళ్ళి సామాను తెస్తూవుంటుంది

ఆరోజు ఉదయం ముసలమ్మ అంది "బియ్యం కూరలూ తేవాలి" అని.

వెంటనే పద్మ అందుకుంది "నేను తెస్తాలెండి. మీరెందుకూ వెళ్లడం?"

"అయ్యో రాత, నీవు బజారుకూడా పోవాలా అమ్మా. వొద్దులే, నేనే వెళ్తా" అంది ముసలమ్మ.

"పర్వాలేదులెండి. రోజు లెప్పుడూ ఇలాగే వుంటాయా? వెళ్లొస్తాను. డబ్బిలా ఇవ్వండి" అంది పద్మ.

ముసలమ్మకి ఎంతకీ మనసొప్పలేదు. ఐనా పద్మ పట్టుదలతో బజారుకి బయలుదేరింది ముసలమ్మ పది రూపాయ లిచ్చింది ఇది గాక చాటుగా పద్మ కొంగుముడిలో పది రూపాయల నోటుంది. ఈ పదీ ఎవ్వరికీ తెలీకుండా వాడుకోవాలి ఎవరికీ అనుమానం తగలకుండా తన జిహ్వాచాపల్యం తీర్చుకోవాలి ముసలమ్మ ఇచ్చిన పది రూపాయలకు తనో ఐదు రూపాయలు చేర్చి ఇంటికి బియ్యం కూరల్తోపాటు చిరుతిండి సామగ్రి శెనగపిండి, రవ్వ, పంచదార వగైరా కొనితెచ్చింది. ఆమెకి మహా కోర్కెగా వుంది—ఏవేవో వండుకు తినాలని. ముసలమ్మ అడిగింది ఇదంతా ఎక్కడిదని.

"మీ రిచ్చిన డబ్బేనమ్మ వొదినా" అంది పద్మ కాస్తో కూస్తో చదువుకున్నదాయె, లెఖ్ఖరాసి చూపించింది—అన్నిటిలోనూ బేడలూ అణాలూ తగ్గించి ముసలమ్మ బ్రహ్మానంద పడిపోయింది పద్మ చెప్పిందల్లా నమ్మేసింది. తను వెళ్తే ముసిల్ది అని బజార్లో మోసం చేస్తున్నారు కాబోలు అనుకుంది. పద్మ చెప్పిన పిండివంటలన్నీ చేసింది అప్పణ్ణించీ ఇంట్లో కాఫీ పెట్టటంగూడా సాగించింది. ఇదే ఫక్కీలో ఎన్నిసార్లయినా ముసలమ్మని మోసగించవచ్చునన్న ధైర్యం వొచ్చేసింది పద్మకి.

ఆవేళ రాత్రి భాస్కరరావు ఇంట్లోనే పడుకున్నాడు. ముసలమ్మ పెట్టిన పకోడీలు ఒజ్జీలూ తింటూ "ఎక్కడివి?" అని అడిగాడతను. ముసలమ్మ "నువ్విచ్చిన డబ్బేటే తెచ్చాను అన్నీ" అన్నది సహజంగా. పద్మని బజారు పంపించి తెప్పించినట్లు తెలిస్తే ఏం కోప్పడతాడో అని ఆమె ఆ విషయం చెప్పలేదు. అంతటితో ఊరుకున్నాడు భాస్కరరావు. పద్మ ఆరాత్రి గూడా తడికదగ్గర చాలాసేపు కూచుని ఎదురింటి యువకునికోసం చూసింది. కాని పోవటానికి వీల్లేకండా భాస్కరరావు ఇంట్లో వుండిపోయినాడు అతనుగూడా డాబాగదిలో కిటకీదగ్గిర కూర్చుని దీపం పెట్టుకుని నిద్రమాని ఈమెవైపే చూస్తున్నాడు. రెండు నిమిషాల కొకసారి పిలుస్తున్నాడు. చేతిగుడ్డ వూపుతాడు. వీధిలో ఎవరన్నా కనపడితే ఆ చేతిగుడ్డతోనే గబగబ విసురుకుంటాడు. ఇలాగ చాలా శ్రమపడుతున్నాడు.

గంటలు దాటిపోతున్నాయి. వెన్నెల స్వచ్ఛమైన తెల్లని కాంతిని ప్రసరింప చేస్తోంది. చలికాలమేమో చలి బాగా ముదిరిపోయి వణికిస్తోంది. నగరపు సందడి పూర్తిగా మణిగిపోయింది. పద్మ ఒకసారి లోపలికీ, ఒకసారి బైటికి చూస్తోంది. భాస్కరరావు గాఢంగా నిద్రపోతున్నాడు. వెళ్ళిపోయి గంటలో తిరిగొస్తే ఈలోగా ఏం ప్రమాదం వస్తుంది? అనుకుంటుంది కాసేపు. మళ్ళీ భయం. ఈలోగా లేస్తే ఎట్లా అని దిగులు. ఈ రహస్యం తెలిసిపోతే తన కోర్కెలు తీరే అవకాశం శాశ్వతంగా అంతరించిపోవచ్చు అని బెంగపట్టుకుం దామెకు.

పద్మ గతరాత్రి అనుభవాల్ని కొత్త కొత్త మెరుగులతో ఊహించుకుంటోంది. ఆమెలోని అణువణువూ తిరిగి ఆ అనుభవాలను వాంఛిస్తున్నాయి. మొదట ఆమె అంతరాత్మ జుగుప్సతో క్షోభించిపోయినా, గుడ్డికోర్కెలు మాత్రం పసిపాప నోరు దుగ్ధం కోసం అంగలార్చినట్లు తీయని అనుభవాలకోసం ఆక్రోశిస్తున్నాయి.

పద్మ గతరాత్రి అనుభవాలను నెమరువేసుకుంటోంది. ఆ గది చదువుకునే విద్యార్థిగదిలా లేదు. విలాసపురుషుల అలంకార సామగ్రితో నిండిఉంది దృష్టిపరిహారార్థం కాబోలు ఒక పుస్తకం బేబిల్ పైన పడివుంది. అతడేవేవో ప్రేమ అంటూ త్యాగం అంటూ చాలా మాట్లాడాడు. పద్మకి ప్రేమా తెలీదు, గోంగూరా తెలీదు. అతడు తెల్లబోయాడు. తన డబ్బుకోసం ఆమె వచ్చిందనే యథార్థాన్ని పూర్తిగా నమ్మడం ఆ యువకుడికి మనస్కరించలేదు. పద్మకి కూడా అతడి వెకిలివేషాలూ సంగినంగి మాటలూ చూస్తే అసహ్యం వేసింది కారాకిల్లీ, సిగరెట్ కంపుతో ఆమెకు వికారం పుట్టింది. కేవలం డబ్బుకోసమే అతడి సాంగత్యానికి ఒప్పుకున్నా శారీరక సౌఖ్యాన్ని చవిమూసే సమయంలో ఆమె అన్ని భయాలనూ, అసహ్యాలనూ మరిచిపోయింది ఈ సౌఖ్యాన్ని, ఈ డబ్బునీ శాశ్వతంగా అనుభవించాలనే లోభంతో అతడిపట్ల ఆదరం, అభిమానం నటించింది. ఇద్దరూ ఒకరినొకరు మోసపుచ్చుకుంటూ గడిపారు. మాయలో, భ్రమలో గడిపారు. ఈ వ్యభిచారంవల్ల ఆమె గర్భవతి అయితే ఏమౌతుంది అనే భయం ఆమెకి లేకపోలేదు అతడా విషయం ఆలోచించనేలేదు. అతని కేమి? ఏ నిమిషాన్నయినా ఆమెని వదలించుకునిపోగలడు.

పరస్పరం వంచించుకుంటున్నట్లు తెలిసినా ఆమె తిరిగి ఆ తీయని అనుభవాలకోసం వేచి కూర్చుంది ఎదురింటి యువకుడు నిప్పుతొక్కిన కోతిలా గంతులేస్తున్నాడు తన గదిలో. వేళకి కాఫీ లేని మనిషిలాగా, నలమందు లేని ముసలివానిలాగా ఉన్నాడు. నిద్ర లేదు. రెండుసార్లు టీ తాగివచ్చి ఇంకా వస్తుంది ఇంకా వస్తుంది అని కూర్చున్నాడు. పద్మ తడిక నానుకునే నిద్రపోయింది. ఎదురింటి యువకుడికి నిద్రరాలేదు. తెల్లారకట్ట మూడు గంటలయింది పద్మ కెందుకో మెలుకువ వచ్చింది. మిగతా అందరూ గాఢనిద్రలో మునిగి ఉన్నారు ఈ సమయంలో వెళ్తే ఏం? అనుకుంది. మెల్లిగా లేచి తడిక తెరుచుకుని డాబా గదిదగ్గరకొచ్చింది రెండంగల్లో. విద్యార్థి నిద్రలో తూగుతున్నాడు. సగం మెలుకువ, సగం మగత. పద్మ కిటికీగుండా మెల్లిగా, 'మధూ మధూ' అని పిల్చింది ఫులిక్కిపడి తత్తరపాటుతో లేచాడు. పద్మ కనపడగానే మహానందపడిపోయి తలుపు తీసి లోపలికి తీసుకుపోయినాడు

"రాత్రి తెల్లవార్లూ నిద్రంటూ పోలేదు నేను" అన్నాడు మధు.

"ప్రేమకోసం ఆపాటి ఒక్కరోజు నిద్ర త్యాగం చెయ్యలేవా" అంది తెలివిగల యువతి పని గడుపుకోవాలనే వుద్దేశంగల యే యువకుడు కాదనగలడు? "ఇంకా ఎన్ని త్యాగాలన్నా చెయ్యగలను నీకోసం; నిద్రమాత్రం, దీనిదుంపతెగ తెగవచ్చేస్తోంది. అది మాత్రం త్యాగం చెయ్యలేను" అన్నాడా ధీశాలి పద్మ చిరునవ్వు నవ్వింది. అరగంటలో పద్మ తిరిగి ఇంటికి వచ్చేసింది. ఇవ్వాళకూడా ఆమె ఒక ఐదురూపాయల కాయితం తెచ్చుకుంది. గుడ్డలు బొత్తిగా లేవు రెండుమూడు రవికల గుడ్డలేనా తెచ్చుకోవాలనుకుంది. అయితే భాస్కరరావు నడిగి రెండురూపాయలు తీసుకుని దానికితోడుగా ఇది కలిపితే 'మాంఛి' గుడ్డలు వస్తాయి. ఆ తర్వాత ఒకరోజు సినిమా కెళ్ళాలి. సినిమాకెళ్ళి ఎన్నాళ్ళయిందో!—ఆమెలో మిగిలిపోయిన చిన్న చిన్న కోర్కెలన్నీ ఇప్పుడు మళ్ళీ చిగురించినాయి

ఆమె తెల్లారి ఏడుగంటలదాకా నిద్ర లేవలేదు. ముసలమ్మ లేపలేదు. ఏదో అలిసిపోయిందనుకుంది.



# మంచీ - చెడూ



భాస్కర్రావు సుందరయ్యగారింట్లో ట్యూషన్ చెబుతూ ఉభయతారకమైన ఒక ప్రయోజనం తనకు తెలీకుండానే పొందుతున్నాడు. సుందరయ్యగారి అమ్మాయి అరుణ అతనితో చాలా చనువుగా ఉండి ఎంతో మనశ్శాంతి నిస్తోంది. ఆమెకి చదువు చెప్పటంలో అతనికి మనశ్శాంతే గాక, ఆనందంకూడా మనస్సులో లోపల పొరల్లో లభిస్తోంది. దాన్ని నీరుపోసి పెంచుతున్నట్టు సుందరయ్యగారు, ఆయన భార్య ప్రవర్తిస్తున్నారు. అతనికిదేమీ యథార్థంగా తెలీదు. అయితే దాని సారాంశం, చిన్న జలలాగా అతనికి అందుతోంది, ఆ యింట్లో వున్న కాసేపూ.

ఇందువల్ల అతను సంతోషంగానే కాలం గడుపుతున్నాడు. కొట్లోకూడా సుందరయ్యగారి సహకారంతో అతనికి పని అతి త్వరగా వచ్చేసింది. అతి నా కొట్లోచేరి ఆరు నెలలయింది. సుందరయ్యగారి సిఫార్సుతోటి అకస్మాత్తుగా జీతంలో పదిరూపాయలు పెరిగింది. ఆరోజు అతను అతి సంతోషంగా ఇంటికివచ్చి పిన్నికి చెప్పాడా శుభవార్త.

పిన్ని సంతోషించింది. "నాకు గుడ్డలు కావాలి. కొనుక్కుంటాను ఈనెల" అందామె చిరునవ్వుతో. ఆమెలోకూడా రెండు మూడు నెలలుగా ఇదివరలో లేని కళకాంతులు ఇప్పుడు ప్రకాశించటంతో భాస్కర్రావు చాలా ఆనందించాడు. "అట్లాగే పిన్నీ! నీకన్నా నా! రేపే కొనుక్కో—" అన్నాడు. "కాని ఆ గుడ్డలేవో వెళ్ళి ఎక్కడైనా కొనుక్కో పిన్నీ, మా కొట్లో అన్నీ సిల్కు గుడ్డలు, చాలా ఖరీదైనవీనూ"

"అట్లాగే అబ్బాయి. నేనూ మీ అత్తయ్య రేపు వెళ్ళి కొనుక్కుంటాం" అంది పద్మ సంతోషంగా.

అప్పటికి, సాయంత్రం ఏడున్నరయింది. ఆవేళ వంట ఎన్నడూ లేనంత బాగా కుదిరింది. బంగాళా దుంపలకూర, ఒక పచ్చడీ, పులుసూ పెరుగు అన్నీ చక్కగా అమరినాయి. భాస్కరం తింటూ తింటూ "పిన్నీ! రోజూ ఇలాంటి భోజనమే ఉంటే మత్తెక్కి ఇంక పనిచెయ్యలేను" అంటూ నవ్వాడు.

"తిరిగి ఎప్పుడు వస్తావబ్బాయి. చీకటిరోజులు గూడానూ" అంది పద్మ.

"రాను, పిన్నీ, అక్కడే పడుకుంటాను. మీరు జాగ్రత్తసుమా" అని భాస్కరం వెళ్ళిపోయాడు.

పద్మ తాను రహస్యంగా సామాన్లతోపాటు తెచ్చుకున్న స్నో - పౌడర్లు, సబ్బు వాడి, పరిశుభ్రంగా అందంగా తయారైంది. బెడ్‌రూం లైట్ మరణకాంతిలో చిన్న అద్దంలో తనను తాను చూసుకుంది. నునుపుగా ఎన్నడూ లేనంత అందంగా కనపడుతోంది ఆమె మొహం. అది ఈ రెండురోజులలో కలిగిన సౌఖ్యప్రాప్తివల్ల వచ్చిన నునుపు. ఇష్టం వచ్చిన తిండి తినటంవల్ల కూడా విర్వృష్ట స్ఫూర్తి ఏమో. ముసలమ్మ కమ్మని నెయ్యివేసి వడ్డించిన భోజనం అతి ఆప్యాయంగా తిన్నది పద్మ. ముసలమ్మ పద్మ టాయిలెట్ నేమీ గుర్తించినట్టు లేదు. ఆమెకి గుర్తించే అవకాశం ఆ గుడ్డిదీపం వెలుగులో లేకపోయింది. అట్లా అనుమానించే తత్వంకాదు గూడా. పద్మ. మనస్సు లేడిలాగా పంజరంలో నించి విడిపించుకున్న చిలకలాగా, ఎగురుతోంది. తన ప్లాను గిట్టేవరికీ తెలియటం అసంభవం. అది వ్యభిచారం అని అంటారు తెలిస్తే. . కాని ఏవిధంగా దారుణమైన తన ఆకలి తీర్చుకోగలదు? తన శరీరవాంఛల్ని న్యాయమైన విధాన చల్లబరుచుకోటానికి అవకాశం ఎక్కడ? అన్ని తలుపులూ వేసి కర్రబుచ్చుకుని కొట్టటానికి ఆరంభిస్తే, పిల్లివంటి పిరికిజంతువు కూడా ఎదురుతిరుగుతుందే! తననీ అంతేచేశారుగా వీళ్ళు! తనేం చెయ్యగలదు ఇంతకన్న? ఆమె ఆత్మ వితర్కం ఇదే ధోరణిలో సాగుతోంది. ఆమె ఇట్లా ఆలోచిస్తూ తడిక సందులోగుండా లోపలికి పడుతున్న వీధిలాంతరు వెలుగు దారల్లో నుల్చుంది.

ముసలమ్మ ఈలోగా భోంచేసి వచ్చింది. "అమ్మాయీ, ఆ దక్షయజ్ఞం పుస్తకం కాస్త చదివి వినిపించమ్మా!" అంది, దీపం, పుస్తకంపట్టుకొచ్చి.

"అలాగే వదినా" అంటూ పద్మ, తన కమ్మనిగొంతు విప్పి, శ్లోకాలూ, పాటలూ వ్యాఖ్యానాలతో వున్న ఆ పుస్తకం చదవసాగింది.

ముసలమ్మ నిమీలిత నేత్రాలతో కూర్చుని యథార్థమైన భక్తిప్రపత్తులతో వింటోంది. పద్మకి ఉత్సాహంగావుంది కాబోలు బహుకమ్మగా చదువుకుంటూ వెళ్తోంది, "అది భిక్షుకుడమ్మ— అతడు తగడమ్మ... అను బోధ వినకయే ఆత్మ గరిమమ్మవ" అని గొప్ప అనుభూతితో చదువుతోంది. ఆ క్షణాన ఆమె మనసెంతో నిర్మలంగా, ఆ కథలో పార్వతి శిలసంపదమీద, పతిభక్తిమీద నిశ్చలతమీద లీనమైవుంది. ప్రతి హిందూయువతి లాగే ఆమెకి కూడా భక్తిప్రపత్తులు పరిపూర్ణంగా వున్నాయి.

డాబాగదిలో మధుసూదనం తన కూనిరాగాలు మానేసి తన్మయత్వంలో పద్మ శ్రావ్యమైన కంఠాన్ని వింటూ కూర్చున్నాడు. ఆమె శరీరమేగాకుండా గొంతుకూడా ఎంత అందంగా అద్భుతంగావుంది. ఎటువంటి నాస్తికుడుకూడా, కాసేపు ఆ భక్తి తత్పరతలో పరితపించిపోగలడే!

రాత్రి తొమ్మిదిన్నర గంటలదాకా ఈ పురాణశ్రవణం జరిగింది. తర్వాత ముసలమ్మ పడుకుంది. పద్మకూడా పక్క వేసుకుని పడుకుంది. అపూట కూడా ముసలమ్మనిద్రపోయినాక జాగ్రత్తగా డాబాగదికి వెళ్ళింది.

## 28

జీవిత సంగ్రామం సాగుతున్నది. సరోజనీ శేఖరం పరస్పర ద్వేషాలతో—పైకేమీ కొట్లాడకుండానే — లోలోపల కక్షలు సాధించుకుంటున్నారు. క్రితంరోజు సుదర్శనంగారు శేఖరాన్ని పలకరించాడు కొంచెం ఘాటుగా.

"అబ్బాయి! అమ్మాయిని ఏదో అంటున్నావటా?"

"ఎబ్బే—లేదండీ! రామరాము—ఎవరన్నారండి మీతో?" శేఖరం నమ్రతగా అన్నాడు.

"అమ్మాయే చెప్పింది. నీతో పెళ్ళికాకే చెప్పాను, అమ్మాయి ఏమంత అందంగా వుండదని, చెప్పానా—లేదా? ఏం?" అని ప్రశ్నించాడు మామ.

"చెప్పారు, చెప్పారు" వంతులువుండు వుద్రాపల్లే తలవూపాడు అల్లుడు. మామని వ్యతిరేకిస్తే ఈ రాబడి బంద్ ఐపోయి, తిరిగీ తన వెనకటి ఫకీర్ స్థితే వస్తుందని అతని భయం.

"మరి ఇంకెందుకు దాన్ని రోజూ రొష్టుపెడుతున్నావట?" సుదర్శనం, ఆఫీసుగదిలో ఈజీచైర్‌లో కూర్చుని, అల్లుణ్ణికూడా ఎదురుగుండా ఇంకో కుర్చీలో కూర్చోబెట్టి ప్రశ్నిస్తున్నాడు స్లీపర్‌లాగా.

శేఖరం సిగరెట్టు ముట్టించి పొగ కిటికీలోకి వూది, "[illegible] టండి మామగారు! ఇష్టపడే చేసుకున్నాగాదండీ? [illegible] అంటాను మీరే చెప్పండి?" అన్నాడు—తో[illegible]

"అయితే అమ్మాయి అబద్ధం ఆడుతోం దంటావా?" సుద ర్శనం నొక్కి అడిగాడు—ఉంటే ఉంటాడు పోతే పోతాడనే ఆయన ధీమా.

"ఎబ్బే లేదండి. అమ్మాయి అబద్ధం ఎందు కాడుతుందండి?" అనేసి, సాలిక కొరుక్కున్నాడు. అతని అధికారం స్త్రీయందే పరిమితం; అతని దాబుసరి కబుర్లన్నీ డబ్బిచ్చి రోజూ కొను క్కునే అభాగ్యులైన వ్యభిచారిణులపైన మాత్రమే. పైగా అదంతా తాత్కాలికం.



# మంచి - చెడూ



"మరి అబద్ధం కాకపోతే నువ్వు ఏదో అంటున్నావనేగా అర్థం? నీకేం అధికారం వుంది దాన్ని అంటానికి?"

తాను కట్టాను గానా?—అందా మనుకున్నాడు శేఖరం. ధైర్యం చాలదు. ఇదే ఐదు నిమిషాలు ఆలోచిస్తూ వుండిపోయి—చివరికి, "అధికారమూ అండీ? ఏదో మొరుక్కిగదా! అందుకని..."

"అందుకని?" రెచ్చిపోయినాడు, సుదర్శనంగారు పళ్లు పట పట కొరుకుతూ

"ఏదో పరిహాసానికి అన్నానండి ..మరి, అది నిజమనుకున్నదండి సరోజిని..." అన్నాడు, చలికాలం పళ్లు పటపటలాడుతూ వుంటే తెల్లారుఝామున భజన చేసేవాళ్ళ పాటలాగా ఒక్కొక్క ముక్కనీ, చీల్చి అంటున్నాడు. అతని చూపు మామగారి వీరభద్ర స్వరూపంమీద నిలవదు. గోడలమీద కాంగ్రెసు నాయకుల ఫోటోల్ని, దీనరక్షకుడైన బుద్ధుడి రూపచిత్రాన్ని చూస్తున్నాడు. ఈక్షణం అక్కణ్ణించి అతన్ని ఏ శక్తయినా తప్పించగలిగితే, ఎంతయినా ఇస్తాడతను. ఏం చేస్తా డతనుమాత్రం? సరోజినిని చూసేవరకల్లా అతనికి ఎక్కడలేని మంట లేగుతుంది. ఉద్రేకం, అసహ్యం ఆపుకోలేడు. ఏదో అనేస్తాడు. ఇంకేం? తెల్లారేసరికి మామగారు పిలకపట్టుకుంటాడు పోనీ ఎక్కడికన్నా వెళ్ళిపోదామా అంటే, అదీ చెయ్యలేడు. డబ్బులేక కరువులోపడి మాడిచావటం ఇక సాధ్యంకాదు. జీవిత శేషం ఇలా సుఖంగా గడిచిపోవాలనే అసలీ పెళ్ళికి వప్పుకున్నాడు. అతనిలో ఇంకో రహస్యంగూడా ఇమిడివుంది. అప్పుడప్పుడు అది జ్ఞాపకం వస్తుంది అతనికి—వళ్లు జలదరిస్తూ వుంటుంది. అది బైటికి తేలితే...

"ఇంకెప్పుడూ అమ్మాయిని అట్లా అనకు. తెలిసిందా?"

"సరేనండి"

"నీ కిష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టుకో. జేబీకి వచ్చి భోంచెయ్యి. ఇష్టం ఐతే దాంతో మాట్లాడు. లేదా? ఎక్కడికన్నా పో. కాని దాన్ని మాత్రం ఏమీ అనకు."

"ఏమీ అననులెండి" అంటూ శేఖరం లేచాడు, బతికానన్నట్టు.

అప్పుడు ఉదయం తొమ్మిది గంటలవుతోంది. "కూచో శేఖరం. కాఫీ ఇక్కడికే వస్తుంది. తాగి వెళ్దువుగాని. నా మాటలకి ఏమీ అనుకోకు. తల్లిలేని పిల్ల; చాలారోజులు పినతల్లి దాన్ని మనోబాధ పెట్టి ఈ గతికి తెచ్చింది. దాని మనస్సును నువ్వుకూడా నొప్పిస్తూవుంటే అది మరీ బేజారైపోతుంది చూడూ! ఇంకో సంగతి నీకు ఇంకా తెలియదనుకుంటాను. సరోజిని చాలా మెత్తని స్వభావం గలది. మంచిది. నిన్నది ఎంతగానో ప్రేమిస్తోంది" అన్నాడు సుదర్శనంగారు తన ఆగ్రహం తగ్గించుకుని లాలనగా. మళ్ళీ అందుకున్నాడు "నీకేమైనా అవసరంగా పైకం కావాలంటే నే నిస్తాను, తీసుకో నాయనా!" అంటూ, జేబులో మనీపర్సు తీసి వందరూపాయల కాయితం అతని చేతి కిచ్చాడు.

కృతజ్ఞతాసూచకంగా నవ్వుతూ కాయితం అందుకుని జేబులో పెట్టుకున్నాడు అల్లుడు.

ఈలోగా వంటవాడు రెండు కప్పుల్లో కాఫీ పోసి తెచ్చి పెట్టాడు. మామా అల్లుడూ ఇద్దరూ చవులూరించే కాఫీ కొంచెం కొంచెంగా చప్పరిస్తూ తాగుతున్నారు. శేఖరం, తన అదృష్టానికి తన్ను తనే అభినందించుకుంటున్నాడు లోలోపల. ఈ అదృష్టాన్ని ఏ కారణం చేతగూడా పోగొట్టుకోగూడదని సంకల్పించుకున్నాడు, కాఫీ తాగుతూ. సరోజినిని ఇంకేమీ అనకూడదు. ఎందుకనాలి? ఏం చేసిం దామె? అని సమర్థించుకున్నాడు. ఆమె మొహం చూడకుండావుంటే సరి. తన భార్యకి ఒక్క మొగ పిల్లాడు కలిగితే చాలు. ఇక, ఫర్వాలేదు తనకి. సముద్రంలాంటి ఈ ఆస్తి యావత్తూ తనదే. అప్పుడిక మామగారు మాట్లాడేదీ వుండదు. శేఖరం మొహంమీద అతనికి తెలియకుండానే చిరునవ్వు వెలిగింది. సుదర్శనంగారు అల్లుడి ప్రసన్నవదనం చూసి, కాఫీ రుచికి అట్లా సంతోషిస్తున్నాడు అని ఊహించాడు.

శేఖరం, అనేకమధ్యాహ్నాల తనప్లాను ప్రకారం, ఒక చీట్లపేక కొనుక్కొచ్చాడు. భోజనాలయినాక సరోజిని గదికి వెళ్ళాడు. సరోజిని, వుదయం భర్తకీ, తండ్రికీ మధ్య జరిగిన సంభాషణ విన్నది. భర్త కోపంవచ్చి వెళ్ళిపోతాడేమో నన్న దిగులు ఆమెను వదలలేదు. అయితే అతను డబ్బుకి దాసుడనీ, రూపాయలముందు ఏం చెయ్యమన్నా చేస్తాడనీ ఆమెకి తెలిసివుండటంవల్ల ధైర్యంగానే వుంది.

శేఖరం చీట్లపేక కలుపుతూ, "సరోజనీ, కాసేపు చీట్లాడుకుందాం రా సరదాగా" అన్నాడు నవ్వుతూ.

సరోజిని బ్రహ్మానంద భరితురాలైంది. తండ్రి మందలించటం వల్ల భర్త తనను ఇకముందు, పీడించటం మానేస్తాడనే అనుకుంది కాని ఇట్లా తనతో సరదాగా కాలక్షేపం చెయ్యగలంత పరివర్తన అతనిలో వస్తుందని ఆమె అనుకోలేదు.

ఆమె కింద రత్నకంబళం పరిచి కూచుంది, భర్తకి ఎదురుగా శేఖరం పేక కత్తెర వేసి "ఏం ఆడదాం?" అని అడిగాడు.

"మీ ఇష్టం. రమ్మీ ఆడదామా?" అని అడిగింది సరోజిని.

"బాగుంది. ఆడదాం. అయితే ఒకటి ఎంత పెట్టుకుందాం? లేకపోతే సరదాగా వుండదు" నవ్వుతున్నా డతడు.

"తమాషాగ్గా. అణా పెడదాం. సరేనా" అంది ఆమె నవ్వుతో.

"సరే." అంటూ శేఖరం ముక్కలు పంచాడు. వాళ్లు ఆడుకుంటూ వుంటే సుదర్శనంగారు అటుపోతూ తొంగిచూసి వెళ్లాడు సంతృప్తితో. సరోజినికూడా వటనే కానీ, యధార్థంగానీ, ఈ ప్రీతికి ఎంతో సంతోషిస్తోంది, జీవితానికి ఈపాటి హాసం—అవసరమేమో! శేఖరం అదే అనుకున్నాడు. [ఇంకావుంది]

# ధ్రువతార

పుతలీబాయి — వృద్ధురాలు.

చిన్నగంగు — పది సంవత్సరముల బాలుడు.

పెదగంగు — సుమారు ఇరువదియైదేండ్లవాడు. దృఢకాయుడు. కాకీ యూనిఫారములో ఉంటాడు. మెడలో 'బాయినెటు' వ్రేలాడుతూ ఉంటుంది అజాద్ హిందుఫౌజు నుండి శలవు తీసుకొని ఇంటికివచ్చి నాల్గు దినాలైంది.

డేవిడ్ డయ్యరు—బ్రిటిషు సార్జంటు. బట్టతల మనిషి. అతనిది గ్రద్దముక్కులాంటి వంకర ముక్కు.

యూసఫ్ ఖా — జమాదారు.

ఇద్దరు నల్గురు — బ్రిటిషు సోల్జరు.

రాంసింగ్ — సిపాయి.

[1945 వ సంవత్సరం వేసవిలో ఒక నాటి నడిరేయి. నీలాల నింగిలో ఒక్క చుక్కైనా పొడవలేదు. పుడమిపై దట్టంగా మంచు తెరలు అలముకున్నాయి. నిశాకన్య నీలిపావడ నిగనిగలు చదలంటుతున్నాయి.

మణిపూరు కొండకోనల నడుమ పర్ణశాల. దూరాన మణిపూరు నది ఎరను తరుముతున్న వల్లత్రాచులా దుముకుతూ గలగలలాడుతూ పరుగెడుతోంది.

కుటీరంలో వృద్ధస్త్రీ ఆతురతతో ఇటు అటు తిరుగుతుంటుంది. చినగంగు కిటికీవద్ద కూర్చొని రెప్పవాల్చక అవతలకు చూస్తూ ఉంటాడు. ఇద్దరి జీర్ణవస్త్రాలలోంచి దైన్యం తొంగిచూస్తూ ఉంటుంది.]

చినగంగు: అమ్మా! ఘడియ ఘడియకు మంచు దట్టమైపోతోంది. జాబిల్లి మరుగుపడ్డాడు. అన్నయ్య ఎల్లా ఇల్లుచేరుకొంటాడో—

పుతలీ: కొంచెం మెల్లిగా మాటాడు. చదుకంలో ఎవరైనా తిరుగుతున్నట్లు కన్పిస్తోందా?

చినగంగు: లేదు. కిటికీ ఎదురుగా ఉన్న రేగిచెట్టే సరిగా అగుపడటంలేదు. కారుచీకటి కమ్మేసింది. అబ్బా! ఈదురోమంటూ గాలి.

పుతలీ: తుఫాను వస్తుందేమో!

చినగంగు: కిటికీలో లాంతరు పెట్టనా?

పుతలీ: ఎందుకు?

చినగంగు: వెలుగు లేకపోతే అన్నయ్య దారి తప్పుతాడేమో.

పుతలీ: వద్దు. ఈల వినిపించేవరకు ఏమీ చేయవద్దు.

చినగంగు: సరేలే. (కొంచెంసేపు ఊరుకొని) అమ్మా! అన్నయ్య ఇంతవరకు నాకు యుద్ధాన్నిగురించి ఏమీ చెప్పలేదు.

గుడిమెళ్ళ
బాలా త్రిపురసుందరి

నే నడుగుతే ఏమీ మాట్లాడకుండా నవ్వి ఊరుకుంటాడు. నువ్వడిగితే పూసగుచ్చినట్లు చెప్తాడు అంతా.

పుతలీ: అన్నయ్య దూరప్రయాణం చేసి వచ్చాడు. వాణ్ణి నువ్వు వేధించకు.

చినగంగు: అదికాదమ్మా! అన్నయ్య బోలెడన్ని ఊళ్లు చూశాడట. రంగం చూశాట్ట. సింగపూరు చూశాట్ట. మలయా చూశాట్ట. ఇంకా ఏమేమో చూశాట్ట. నాకు వాటినిగురించి వినాలని ఎంతో కుతూహలంగా ఉంది. (తల్లి కొంగు పట్టుకొని) అన్నయ్యతో నువ్వు చెప్పమనవూ?

పుతలీ: అలాగేలే.

చినగంగు: అమ్మోయి! అన్నయ్యంతవాణ్ణి అయినతర్వాత నేనూడా పటాలంలో చేరిపోతా. ఏం?

పుతలీ: అలాగే.

చినగంగు: (ఉలిక్కిపడి) ఏదో శబ్దం అయినట్లుందే.

పుతలీ: (పరికించి) ఏం లేదు. సరుగుడుతోటలో గాలిపోసుకొంటే రొద కల్గుతోంది. అంతే.

చినగంగు: అమ్మా. నీకివ్వాళ కొంచెం భయంగా ఉంది.

పుతలీ: భయ మెందుకు, చిట్టితండ్రీ!

చినగంగు: నాన్నగారు ఎక్కడికో ఊరు వెళ్ళారన్నావు చూశావూ! ఆ రోజూ ఇల్లాగే భయంవేసింది. (ఆత్రుతతో) నాన్నగారు తిరిగి ఎప్పుడు వస్తారమ్మా?

పుతలీ: (కంట తడిబెట్టి) వస్తారులే. నీ కెందుకు భయం?

చినగంగు: ఈ ప్రొద్దు పొలంకి వెళ్లివస్తూ చూచానమ్మా. పదిమంది ఎఱ్ఱటోపీలవాళ్లని. వెధవ బుంగమీసాలూ వాళ్లూను. అందులో ఒకడిది బట్టతల. టోపీ తీసి చేతిలో పట్టుకొన్నాడు. ఉడుతలు పీకిన తాటిటెంకలా ఉంది వాడి తొగరురంగు తల (చేయి చాస్తూ) వాళ్ళదగ్గరేం - ఇంతింత పెద్దపెద్ద తుపాకులున్నాయి పెద్దపెద్ద కత్తులుకూడా ఉన్నాయి దుబేగారి దయ్యాలమేడ వుంది చూశావూ? ఊరిబయట-అందులో ఉన్నారమ్మా వీళ్లు. కసాయివాడు గోజ్జూ ఇల్లా వెడుతో ఉంటాడు చూశావు — వాడంత భీకరంగా ఉన్నారు వీళ్ళు. వసలతిగారి బుల్లబ్బాయి వీళ్ళని చూచి కారుకారుమని ఏడ్చాడు. ఊళ్లోవున్న పిల్లలందర్నీ పట్టుకొని ఊపిరాడకుండా సంచుల్లో వేసి బిగించి తీసుకుపోతారట.

పుతలీ: ఎవరు చెప్పారీ మాట?

చినగంగు: సాయీ—

పుతలీ: అవన్నీ ఉత్తుత్తి మాటలు.

చినగంగు: కాదమ్మా. వాళ్ల వీపులమీద సంచులున్నాయి. ఆ సంచులు చూస్తే నా గుండెల్లో రాయి పడ్డట్టయింది.

పుతలీ: ఓయి, భగవంతుడా! జడుసుకోలేదుకదా వీడు. (కొంచెం ఉప్పుతెచ్చి దిగదుడిచి పారవేస్తుంది) ఈశ్వరుడా, ఈ పసికూనలు నీ సొత్తు.

చినగంగు: నేను యుద్ధానికెళ్ళి ఏం చేశానో తెలుసా?

 

# ధ్రువతార



పుతలీ: (కుతూహలంతో) ఏం చేశావు?

చినగంగు: వాళ్ల మేడ చేరువనే ఉన్న చెట్టెక్కి చూశాను.

పుతలీ: తగులబడిన చెట్టే ఉంది ప్రయోజనత్వం

చినగంగు: (దీనంగా) అమ్మా! నే చేసింది తప్పు పనా?



పుతలీ: (లేని సంతోషం తెచ్చుకొని) కాదులే. వాళ్ళేం చేశారు?

చిన్నగంగు: రెండు కోరీలుగా బయలుదేరారు. నిల్చార్ దారినిపట్టి ఒక ముఠా పోయింది. వంతూ మార్గాన్ని పట్టి రెండో కోలీ పోయింది.

[దూరాన్నుండి ఈల పాట మెల్లగా వినిపిస్తుంది.]

చినగంగు: (ఒక్క గంతువేసి) అదిగో-సంగీతం—

పుతలీ: ఊఁ (చినగంగు లాంతరు ఎత్తి-పట్టుకొని కిటికీవద్ద నిలబడతాడు.)

పుతలీ: అబ్బాయీ! లాంతరు ఆర్పేయి. వెలుగులో గుమ్మందగ్గర నిలబడ్డవాడు చుట్టుపట్ల ఆముడ దూరంవరకు పుచ్చపువ్వులా కన్పిస్తాడు.

[చిన్నగంగు లాంతరు ఆర్పేస్తాడు. తలుపుతోసుకొని పెదగంగు ప్రవేశిస్తాడు. పుతలీ ఆముదపు దీపం వెలిగిస్తుంది పెదగంగు బాగా అలసిఉంటాడు. ఒళ్లంతా తడిసి ఉంటుంది]

పుతలీ: బాయీ నా! మంచులో తడిసి ముద్దయినట్లున్నావు కోటు విప్పేయి.

పెదగంగు: (కోటు విప్పుతూ) ఈ దరిద్ర గొట్టు ఎట్లాటో ఓ గాళ్లను తప్పించుకొని వచ్చేసరికి తలప్రాణం తోకకు వచ్చింది

పుతలీ: ఏమల్లా దాపరించారు వీళ్లు.

చినగంగు: కోరివిదయ్యాల్లా ఉన్నారమ్మా వీళ్లు.

పెదగంగు: ప్రేమీపహాడ్ కొండకోనల చిట్టడవి ఉంది చూశావూ. ఇక్కడికి పది కోసులుంది. అక్కడున్నారు నా జత... (చిన్నగంగుని చూచి - ఏదో జ్ఞప్తికి తెచ్చుకొన్నవాడిలా) గంగూ! అమ్మ లేవలేదు. వెళ్ళి కాస్త టీ కాచిపెడుదూ! గొంతుక ఎండిపోయింది.

[వెళ్ల లేక వెళ్లలేక కాళ్లీడ్చుకొంటూ చినగంగు వంటింట్లోకి వెడతాడు.]

పెదగంగు: (నిట్టూర్చి) అమ్మా. తమ్ముడి కోట్లో మువ్వగింజ నానదు.

పుతలీ: కాని వాడు నీకథ తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరుతున్నాడునుమా! మీ యుద్ధాన్ని గురించి ఎవరేమి అనుకొంటున్నా చెవులప్పగించి వింటాడు. వాడికున్న ఆసక్తి బాగా ఉంది. అయితే - అలసి సొలసివస్తే, వినిగించడ మెందుకని నిన్ను అడగడం మానుకొంటున్నా—

పెదగంగు: దానికేమమ్మా - జర్మనీ, ఇటలీ, క్రోషియా, జపాను, మంచూకో. సానిక్యంగు, బర్మా, ఫిలిప్పైను దీవుల విపణివిథుల్లో ఆజాదు హిందు సర్కారు వారి రాయబారులు చెలామణి అవుతున్నాయి. ఈ ప్రభుత్వాన్ని నెలకొల్పిన జ్ఞానజ్యోతి నేతాజీ - ఆ మహానుభావుణ్ణి గూర్చి ఎంతని వర్ణించను?

పుతలీ: ఔను. ఆయన ఆదర్శజీవితం నుండి భరతఖండం దేశప్రేమను పిండుకొంటోంది—

పెదగంగు: ఆయన మాతృదేశాన్ని విశ్వపటాన నెక్కించిన తేజోరాశి. మూర్తీభవించిన స్వాతంత్ర్య దేవత. ఆయన గంభీరోపన్యాసం రాళ్లకు చైతన్యం కల్గిస్తుంది. చేతనజగత్తును తాన్సేనుమధుర గేయంలాగ మంత్రముగ్ధనుగా చేస్తుంది ఆయన ప్రతి భారతీయుని హృదయసామ్రాజ్యాన్ని పాదాక్రాంతం చేసుకొన్నాడు.

పుతలీ: ఆయన గొప్ప కర్మయోగి. ఆయన చెప్పిన ముక్క లేవైనా నాల్గు చెప్పవదూ—విని సంతోషిస్తా.

పెదగంగు: అమ్మా! నిరుడు ఫిబ్రవరినెల నాల్గవరోజున హిందూదేశంనుండి తెల్ల రక్కసులను తోలివేయడానికి రంగంనుండి బయలుదేరాం. అదో పెద్ద పర్వదినం మాకు. ఆరోజున నేతాజీ మాకిచ్చిన తీపు లూరించే సందేశం చదువుతా విను (జేబులోనుంచి కాగితాన్ని తీసి, ఎంతో ప్రేమతో మడత విప్పి చదవసాగ ప్రారంభిస్తాడు. పుతలీ ప్రమిదలోని వత్తిని ఎగసందోసి తదేకధ్యానంతో కొడుకు చదివేది వింటుంది. అది 1944 వ సంవత్సరము ఫిబ్రవరినెల నాల్గవ తేదీని నేతాజీ అజాద్ హిందుఫౌజు సైనికుల కిచ్చిన సందేశం.

"అక్కడ—అదిగో అక్కడ — నదికావల, అడవులకు ఆ కొండలకూ ఆవల, దైవదత్తమైన మనదేశం ఉంది అక్కడ మనం పుట్టాం. ఆ దేశానికి మనం తిరిగి తరలి వెళుతున్నాం.

"వినండి. భారతమాత పిలుస్తోంది. హిందూదేశపు రాజధాని ఢిల్లీ స్వాగతమిస్తోంది. 38 కోట్ల స్వదేశీయులు మనల్ని రమ్మంటున్నారు. బంధువులు బంధువులను పిలుస్తున్నారు.

"లెండి కాలయాపనకు వీలులేదు. అస్త్రాలను ధరించండి. అదిగో - పురోగాములు నిర్మించిన రాజబాట మీ ముందున్నది. ఆ మార్గముపై మన సైన్యాలు పోవాలి. శత్రువ్యూహమును బ్రద్దలుచేసుకొని మనం దారిచేసుకొందాం. భగవదాజ్ఞ అదే అయితే వీరస్వర్గ మలంకరిద్దాం.

"తుట్టతుది అడుగులో యీ మురికొత్త బాటను ముగిసుకొంటాం. ...

సేనావాహినిని ఢిల్లీకి గొనిపోతుంది. ఢిల్లీ బాటే స్వాతంత్ర్యానికి మార్గం. చలో ఢిల్లీ." (కౌగిలాన్ని భద్రంగా మడిచి జేబులో పెట్టుకొంటాడు.)

ప్రతిలీ: ఆహా! పసిడి పలుకులు! మీగడ తరకలు. వజ్రపుతునకలు - ముత్యాల కోవలు.

పెద్దగంగు: ఆ దినం ఆనందంతో ఒళ్ళు పట్టలేకపోయాను. నా నరాలలో లేని కాల్వలు ఉప్పు తెప్పలై ప్రవహించినట్లు తోచింది. ఆరకాన పర్వతశిఖరాలు, వాని కౌవల ఛింద్విన్ నది, దాని ఒడిలో పల్లె కలువలు పదజిమ్మబడినట్లు గుర్తుమైన అడవులు కళ్ళకు కట్టినట్లు గోచరించాయి. హనుమంతుడు లంకను ఒక్క దూకులో

 

# ధ్రువతార



లంఘించినట్లు ఒక్క గంతులో వానిని అన్నింటిని దాటి మన పుణ్యభూమి పొలిమేరలలో వాలగల వనిపించింది

పుతలీ నేతాజీ తలపెట్టిన కార్యం నిర్విఘ్నంగా సాగాలని వెయ్యిదేవుళ్ళకి మ్రొక్కుతున్నా! అది సాగితేనే భారత దేశంలో వికవికలాడుతున్న కోట్లకొలది డొక్కలకు పట్టెడన్నం దొరుకుతుంది అయితే, పెద్దాడా మళ్ళీ తిరిగి పటాలానికి ఎప్పుడు వెళ్ళాలి?

పెదగంగు (విషాదంతో) సరిగా చెప్పలేం. పరిస్థితులు కొంచెం విషమించాయి. మాది జపానువారిది కలసి రెండు లక్షల సైన్యం ఇప్పుడు 20 లక్షల అమెరికన, బ్రిటిషు, ఆస్ట్రేలియను సైనిక దళాల కెదురునిలిచి మేము పోరవలసివచ్చింది.

పుతలీ యుద్ధం నిలుపుచేశారా?

పెద్దగంగు లేదు. కొస్త మందగించింది అంతే మా సమరం ఇంతటితో ముగిసేది కాదు (చినగంగు టీ మట్టిపాత్రలో పోసి పట్టుకువస్తాడు పెదగంగు బోయినెటు క్రిందపెట్టి టీ అందుకుంటాడు )

చినగంగు (కాలివ్రేళ్ళమీద నిలబడి చేయి పైకెత్తి) అన్నయ్యా, నేనింత పెద్దవాణ్ణాయినాక పటాలంలో చేర్చుకుంటారు కదూ! ఎంచక్క అప్పుడు నిన్ను విడవక నీతోనే ఉంటాను నవ లేకపోతే నాకూ అమ్మకూ ఏమీ తోచదు, అన్నయ్యా! కాదే, అమ్మా?

పుతలీ: అవును నాయనా.

[బయట తలుపు కొట్టిన చప్పుడు.]

పుతలీ: (తత్తరపాటుతో – మెల్లిగా పెద్దాడా! లే! లేగిచెట్టుప్రక్క గడ్డిమేటి ఉంది. అక్కడ దాక్కో. పో. (పెదగంగు పెరటిలోకి వెళ్ళిపోతాడు. చినగంగు మట్టిపాత్రను ఓ మూలకుతోసి, అన్నయ్యకోటును పట్టుకొనిపోయి వంటింట్లో పెట్టి వస్తాడు నేలమీద బాయినెటు అట్లాగే పడిఉంటుంది )

పుతలీ (గొంతు సవరించుకొని) ఎవరు వారు?

బయటధ్వని. తలుపు తీయండి.

చిన్నగంగు (బిగ్గరగా) ఎందుకూ?

బయటధ్వని (మోటగా) డామిట్! వెంటనే తెరుస్తావా? లేకపోతే ఒక తన్ను తన్ని తలుపు ఊడబెరకమన్నావా? (బూటు కాలితో నేలను ధూకుడుగా తన్నిన శబ్దం )

[తల్లి సైగచేయగా చిన్నగంగు తలుపు తెరుస్తాడు బ్రిటిషు సార్జంటు వానివెనుక ఒకొక్కరుగా జమాదారు, పోల్జరు, సిపాయి లోన ప్రవేశిస్తారు సార్జంటు చేతిలో వెండికట్టుకట్టిన సన్నని పేకబెత్తం ఉంటుంది )

యాసిన్. (గదిమూలనున్న మట్టిపాత్రను సార్జంటుకు చూపిస్తూ) చూశారా?

పుతలీ అవును. మా చిన్నాడు ఇప్పుడే టీ తాగాడు.

[సార్జంటు గదినంతా కలయచూస్తాడు నేలమీద పడిన బాయినటుపై వాని దృష్టి పడుతుంది ]

సార్జంటు (బాయనటును పైకి తీసి) మీ చిన్నాడికి దీనితో ఏమిటి పని?

పుతలీ. (తెల్లపోయి కొంచెం ధైర్యం తెచ్చుకొని) ఈ కుర్రాడు ఎక్కడినుంచో పట్టుకొచ్చాడు బాబూ కత్తి అల్లరివాడు, క్షమించండి. మీదైతే తీసుకుపోండి

సార్జంటు: (సిపాయితో) పిట్ట ఇప్పుడే ఎగిరిపోయి ఉంటుంది బయటకు పోయి గాలించు. మిస్టర్ యాసిన్! నువ్వు కూడ పోయి చూడు. హరియాప్

[ఇద్దరు బయటకి పోయి చీకటిలో ఏమీ కానక పది నిమిషాలలో తిరిగి లోపలకు వస్తారు ]

యాసిన్: సార్జంట్ సాబ్! పంఛీ గాయబ్

సిపాయి: అంతేనండి.

సార్జంటు: షటప్ బ్లడీ యూస్ మీ రిక్కడ ఉండండి (కొంచెం ఆలోచించి) డొనాల్డ్! నీవు నాతో రా (బాటరీలైటు చేబులోనుంచి తీస్తాడు. ముందు సార్జంటు వెనుక పోల్జరు వెదకటానికి బయలుదేరుతారు)

సార్జంటు: (డొనాల్డు చెవిలో) మై డియర్ డొనాల్డ్! ఈ నల్లగాడిదలను విశ్వసించలేం వీళ్ళకు మనమీదుండే ద్వేషం ఇంతింత కాదు ముఖ్యంగా ఆఫీసర్లకు.

[1945 వ సంవత్సరము అక్టోబరు నెలలో ప్రచురితమైన 'లండను ట్రిబ్యూను' అను వారపత్రికయొక్క రెండవ సంచికలో డేవిడ్ కార్పెంటరు ఇట్లా వ్రాశాడు.

*"A transcendent feature of the political situation in India is the volcanic hatred that one finds in the people's hearts for England and everything English Nowhere is this hatred stronger than among the officers "*

కార్పెంటరు ఆకాలంలో బ్రిటిషు సైన్యంలో ఆఫీసరుగా పనిచేస్తూ ఉండేవాడు.] ఈయాసిను గాణ్ణి చింకేద్దామన్నంత కోపం వస్తుంది నాకూ అప్పుడప్పుడు - వాడి దొంగవేషాలు చూస్తూఉంటే——

పోల్జరు నాకు తెలిసినంతవరకు యాసిన్ వీరుడు

సార్జంటు నీకేం తెలీదులే పద

(ఇద్దరూ ఖకదకా నడిచివెడతారు పది నిమిషాలలో పెదగంగుతో ప్రవేశిస్తారు పెదగంగు చేతులు వెనుకకు విరిచి కట్టబడి ఉంటాయి )

సార్జంటు: (వృద్ధురాలి నుద్దేశించి) ఓసి, మాయలమరాఠీ! (పెదగంగును చూపించి) ఈ ఉల్లూ ఎవ డంటావ్?

(పుతలీ కళ్ళు మిటకరించి చూస్తుంది. కొంతసేపటికి తేరుకొంటుంది)

పుతలీ ఇతడు మాఅప్పగారి అబ్బాయి. మీ రెవరో గొప్పవాళ్లలా ఉన్నారు. మీకు మావాడిమీద కోపమెందుకు?

సార్జంటు. తరవాత చెప్తాం సింగ్! ఇతని జేబు చూడు

[సిపాయి, గంగుజేబులు తడిమి నేతాజీ సందేశపత్రాన్ని బయటకు తీస్తాడు సార్జంటు ఆ కాగితాన్ని అందుకొని చదువుకొంటాడు. కళ్ళు జేగురురాళ్లలా ఎర్రబడతాయి గదిలో ఉన్న గడమంచిమీద చతికిలబడతాడు ]





సార్జంటు: డోనాల్డు! వాణ్ణిలా తీసుకొచ్చి నా ఎదుట నిలబెట్టు.

[డోనాల్డూ, రాంసింగూ గంగుని పట్టుకొని సార్జంటు ఎదుట నిలబెడతారు. ఖైదీ పారిపోతాడనే భయంతో వారిరువురు చెరొక ప్రక్క నిలబడతారు.]

సార్జంట్: (గంగూతో) ఏమోయ్. నిన్ను కొన్ని ప్రశ్నలడుగుతాను. సూటిగా సమాధానం చెప్పు. జాగ్రత సుమా! అవకతవక సమాధానాలిచ్చావంటే నీకు భూమిమీద నూకలు సున్నే.

పెదగంగు: అల్లాగాండి.

సార్జంట్: నీతో వచ్చిన దట్ బ్లడీ సైగల్, వాడి హుసార్లు (అశ్వారోహులు) ఎక్కడున్నారు?

పెదగంగు: సైగల్‌ను నేను చూడలేదు.

సార్జంట్: పోనీ - నీమాటే నమ్ముదాం. కాగా నీతో వచ్చిన జట్టుకి లీడరెవరు?

పెదగంగు: నే నిక్కడకు ఒంటరిగా నే వచ్చా.

సార్జంట్: డొంకతిరుగుడు సమాధానాలు కట్టిపెట్టి - మీవాళ్లు ఎక్కడున్నారో త్వరగా చెప్పేయి

చినగంగు: వాళ్లెక్కడున్నారో చెప్పనా?

సార్జంట్: ఈ గుంటడు తెలివైన వాడిలా ఉన్నాడు. అబ్బాయి! చెప్పు మాతాం.

చినగంగు: ఉన్నచోటే ఉన్నారు.

సార్జంట్: (చిన్నబుచ్చుకొని) బ్లడీ ఫూల్! డోనాల్డ్! ఈ కుర్రగాడిదని కొంచెం మరమ్మతు చెయ్యి.

[సోల్జరు వచ్చి చినగంగు చెవి మెలిపెడతాడు. కుర్రవాడు నవ్వుతూ ఉంటాడు. పెదగంగు ముఖం కోపంతో కందగడ్డలా మారుతుంది. సార్జంటుకి ఉక్రోషం వస్తుంది.]

ఫుతలీ: (సోల్జరుతో) ముక్కుపచ్చలారని పసికూనమీద చూపిస్తావేమిటయ్యా నీ ప్రతాపం. ఇంతకీ వాడు చేసిన తప్పేమిటి?

[సోల్జరు సిగ్గుపడి రెండడుగులు వెనక్కు వేస్తాడు]

పెదగంగు: (తలితో) ఇతరులు అక్రమంగా ప్రవర్తించేచోట సక్రమంగా ప్రవర్తించటమే క్రూరులకు కోపకారణం.

సార్జంటు: (పళ్ళు కొరుకుతూ) బ్రిటిషు ప్రభుత్వమువారి రక్షణ చట్టం క్రింద బ్రిటిషు ఆఫీసరునైన నేను నీమీద (పేకబెత్తము పెదగంగు గుండెమీదుంచి) యీ నేరాలను మోపుతున్నా. ఒకటి - రాజద్రోహులైన అజాదు హిందు సైనికులకు

రెండు - వారి ఉనికి తెలిసుండి కూడా చెప్పడానికి నిరాకరిస్తున్నావు. మూడు - నా ఆజ్ఞను ధిక్కరిస్తున్నావు. నాల్గు - పైగా ఎత్తిపొడుపు మాటలాడుతున్నావు. ఐదు - నీకు తెలిసిన విషయాలను మాకు చెప్పక దాస్తున్నావు. ఆరు - బ్రిటిషు ప్రభుత్వం వారి తాబేదార్లు వారల విధ్యుక్త ధర్మాలను నిర్వర్తించుటలో నిరోధం కల్పిస్తున్నావు. ఏడు - పైపెచ్చు వారలయందు ద్రోహాన్వేషణ చేస్తున్నావు. ఈ నేరాలకు నీకు మరణదండన విధింపదలచుకొన్నా.

ఫుతలీ: నీవు మావాడిని ఏమీ చెయ్యలేవు.

సార్జంటు: (వెటకారంగా) ఉహూ!

ఫుతలీ: దేవుడంటే నమ్మకం ఉంటే పాపానికి ఒడిగట్టవు.

సార్జంటు: (ఆకసంవైపు చూపించుతూ) మనం అక్కడికి వెళ్ళినప్పుడే దేవునిగూర్చి ఆలోచించేది.

యాసిన్: (మెల్లిగా) సార్జంటు సాబ్! సంజాయిషీ లేకుండా శిక్ష ఏమిటి?

సార్జంటు: బ్లడీ ఫెయర్స్! సార్జంటు మాటే ఇక్కడ చట్టం.

యాసిన్: ఇక్కడనుండి వెళ్ళిన తర్వాత పశ్చాత్తాపపడవలసి వస్తుందేమో!

సార్జంటు: (విసుగుగా) డామిట్! ఈ విషయంలో నీ జోక్యాన్ని గర్హిస్తున్నా. కానీ, నీవు చెప్పినట్లే సంజాయిషీ తీసుకొంటా (పెదగంగుతో) ఏయి - దీంబోతూ! నే మోపిన చార్జీలకి ఏం సమాధానం చెపుతావ్? (పెదగంగు మాట్లాడడు.)

సార్జంటు: బెల్లంకొట్టిన రాయి!

పెదగంగు: నేను నీ కట్టె సమాధానం ఇవ్వదలచుకోలేదు. నీ ముఖం చూచినా నీ మాటలు విన్నా రోతపుడుతుంది.

సా: ప్రాణాలను అరిచేతిలో పెట్టుకొనే ఉన్నావన్నమాట. సరే. (లాలనతో) అబ్బాయ్ జీవితం మకరందంవంటిది. పదికాలాలపాటు బతకదలచినవాడివి ఈపాటికి ఏ చిలకమీదో మనస్సు నిలిపేఉంటావు. ముగ్ధకంఠం జప్తి కలయింగుకొని నే నడిగినదానికి సమాధానమియ్యి.

పెదగంగు: నీతో చెప్పవలసిన దేదీలేదని ముందే చెప్పాను.

సార్జంటు: అధమం నీ ముసలితల్లిమీదుండే ప్రేమ స్మరించుకో!

పెదగంగు: సార్జంట్! చైతన్యవిహీనమైన యీ తుపాకులను చూచుకొని మురిసిపోయి మిడిసిపడుతున్నావు. నీ క్రౌర్యం నా భౌతిక దేహాన్ని మట్టిలో కల్పినా, నా యెడదను పులకింపచేసే స్వేచ్ఛావాయువుల నరికట్టలేవు. నా హృదయం విచ్చగానే యీ వాయువులు అందులోనుండిలేచి దశదిశలూ అలముకుంటాయి.

సార్జంటు: (వికటాట్టహాసంతో) అహా! క్లిమ్‌దోర పదునాల్గవ సైన్యం పదునాల్గు గంటలలో యీ రకం సైత్యాన్ని యీ గడ్డలో రూపుమాపకపోతే నేను నా పేరు పెట్టుకొంటా. అబ్బాయ్. నువ్వు వెర్రివాడిలా ఉన్నావు. మీ ఆఫీసర్లందరు బ్రిటిషువారి హస్తగతమయ్యారు. ఏం లాభంలేదు. నే నడిగిన రవంత ప్రశ్నకు సమాధానం చెపితే మీ స్నేహితులకు నష్టం జరగదు సరిగదా నీకు లాభం తప్పక జరుగుతుంది. నిన్ను హవిల్దారుగా మా సైన్యంలో వేసుకొంటాం. వృద్ధిలోకి రాదలచినవాడివి. వెర్రి మొర్రి ఊహాలు తోసి



# ధ్రువతార

పోలేయి. (గంగు మాట్లాడడు) పోనీ డబ్బు కావాలంటావా? పుష్కలంగా ఇప్పిస్తా. (గంగు తూష్ణీంభావం వహిస్తాడు)

సార్జంటు: (డోనాల్డుతో) ఈ మూగవాడిని బయటకు ఈడ్చుకుపోండి. వాడి మొద్దుమొహం చూస్తే అసహ్యం వేస్తోంది.

పెదగంగూ: దేవుళ్ళు చేశాడు మనం తిరిగి ఒకళ్ళ ముఖాల నొకళ్లు చూసుకోవలసి ఉంటుందని మీ మతగ్రంథం చెపుతోంది. [సార్జంటుకేసి చూసి నవ్వుతూ] అంతే నంటావా? (పుతలీకేసి తిరిగి నమస్కరిస్తాడు. డోనాల్డు, రాంసింగు అతనిని బయటకు తోసుకొనిపోతారు. పెదగంగు ముఖంపై అవగింజంతైనా విషాదం మొలకెత్తినట్లగుపడదు. 'నా జీవిత మొక విజయోత్సవమని ఋజువు చేయడానికి పోతున్నా' అంటూ పోల్లరు వెనుకనే బయటికి పోతాడు. సార్జంటు పళ్లు పటపట కొరుకుతూ బూటుకాలితో నేలను తన్నుతాడు)

సార్జంటు: యాసిన్! (కొంతతడవు ఊరుకొని) వీడు అయఃపిండంలాంటివాడోయి. పట్టి మూర్ఖుడు. ఎక్కిన కొమ్మను నరుక్కునే రకం.

యాసిన్: సాబ్! వాని స్థైర్యం ప్రశంసనీయం. త్యాగనిరతిని స్వీయ జీవితంలో కడపోసుకున్నాడు.

సార్జంటు: (విషపునవ్వుతో) త్యాగం– ఓహో! యాసిన్! ఇంగ్లీషు దీవుల్లోనే అది దొరుకుతుంది. కంచుకాగడాలతో గాలించినప్పటికీ మరెక్కడా అది కన్పించదు.

యాసిన్: వాడి పట్టుదల చూస్తే నాకు సిగ్గేస్తోంది.

సార్జంటు: యాసిన్ – ఆ సంగతి వదిలేయి. మందభాగ్యుడు. ఖర్మ మంత. నేనైతే భాగ్యాన్ని అంత చులకనగా తృణీకరించను.

యాసిన్: వాడివద్ద గుట్టు తీయలేకపోయారు.

సార్జంటు: అప్పుడే పెదవి విరవకు. ఈ ముసలిదానికి కొంత చేపితే కార్యం సిద్ధించవచ్చు. (రూపాయి జేబులోంచి తీసి పుతలీవేపు విసరి) అవ్వా! ఇది నీవద్ద వుంచుకో. నీకు ప్రతి నెలా పది రూపాయలు పింఛను వచ్చే ఏర్పాటు చేస్తున్నా. పాపం బీద దానివి. మీ అప్పకొడుకుకేం భయం లేదులే.

పుతలీ: (రూపాయివైపు పెడముఖము పెట్టి) నా కివ్వన్నీ ఎందుకయ్యా.

సార్జంటు: వద్దా?

పుతలీ: ఏమాత్రం వద్దు. ముమ్మాటికీ వద్దు.

సార్జంటు: పోనీ. మీ అప్పకొడుకు ప్రాణాలు రక్షించాలనే ఆశ ఉందా?

పుతలీ: ఎవరి ప్రాణాలనైనా మానవమాత్రులు రక్షించగలరా? భగవంతుడు నీలో ఉండి మంచి చేయించాలిగాని——

సార్జంటు: ఆ అబ్బాయి జతగాళ్ళు ఎక్కడున్నారు?

పుతలీ: నాకు తెలీదు – తెలిసినా చెప్పను.

సార్జంటు: బ్లడీ రోగ్! ఎందుకు చెప్పవూ?

పుతలీ: చెప్పదలచుకోలేదు కాబట్టి. (గద్గదకంఠంతో) మా అబ్బాయికి వేసిన శిక్షే నాకూ వేయండి. నేరం ఒకటేగా.

చినగంగు: ఆ శిక్షే నాకూ వేయండి.

[యుద్ధంలో పరాజయం పొందిన సేనానిలా సార్జంటు ముఖం వేలవేస్తాడు. చినగంగు తల్లిముఖంకేసి చూస్తూఉంటాడు. పుతలీ పరధ్యానంలో పడుతుంది. ఎంతసేపు వేచినా ఆమె నోట మాటలేదు. ఆమెకేసి చూస్తున్నకొద్దీ సార్జంటు అరికాలిమంట నెత్తికెక్కుతుంది.

సార్జంటు: (హఠాత్తుగా) యాసిన్! నక్కవగిదని గెరువుగిరివద్దకు తీసుకొని పోయి కాల్చెయి.

యాసిన్: సార్జంట్ సాబ్! క్లెవ్ దొర అనుజ్ఞలేనిదే ఏ పౌరునీ కాల్చకూడదు.

సార్జంటు: (వెటకారంగా) మై డియర్ యాసిన్! నేను బ్రిటిషు సార్జంటును. పానకంలో అడ్డుపుడక వేయక చెప్పింది చేయి.

యాసిన్: ఇది హత్య. (ఉద్రేకంతో) దీనికి నేను బాధ్యుణ్ణి కాను.

సార్జంటు: నీవు బాధ్యుడవని ఎవరు చెప్పేరూ? నీవూ కావు నేనూ కాను——

యాసిన్: వారంటు లేకపోతే మీ ఆజ్ఞను ఉల్లంఘించవలసి వస్తుంది.

సార్జంటు: యాసిన్! అనుభవం లేనివాడివి! ఇల్లా రా! (చెవులో) ఇటువంటి చిన్న చిన్న విషయాలను రచ్చకు లాగితే బ్రిటిషు సేనలో నీకు పురోభివృద్ధి ఉండదు. తెలిసిందా?

యాసిన్: నా లాభం మీ ఖుషీపై ఉంటుంది. అట్లని యీ విషయంలో నా హృదయాన్ని చంపుకోను. మీరు వారంటు రాసిస్తే ఆ ప్రకారం అమలు జరుపుతా. అంతే!

సార్జంటు: అవిధేయత! నీ చేసిన ప్రతి పనిని బ్రిటిషు ప్రభుత్వం సమర్థిస్తుందని నీకు తెలీదూ? తెలుసు. ఎందు కింత పెంకు. పోనీలే, కానీ! (జేబులోనుంచి నోటు బుక్కు తీసి వారంటు వ్రాసి యాసినుకందిస్తాడు. వారంటు తీసుకొని సార్జంటువైపువు పెట్టి 'థూ. పిరికిపంద' అంటూ బూటు కాలితో గడప తన్ని యాసిను వెళ్ళిపోతాడు.)

చినగంగు: (సార్జంటుతో) మా అన్నయ్యజట్టు ఎక్కడున్నారో నాకు తెలుసు.

సార్జంటు: (విసుగ్గా) పో, ఇడియట్.

చిన్నగంగు: నిజంగానే. ఆ సంగతి చెప్పితే ఏమిస్తారు?

సార్జంటు: ఏం కావలిస్తే అది ఇస్తా.

చిన్నగంగు: ప్రేమగిరి కొండల అడవి లేదూ! అందులో ఉన్నారు వాళ్ళు.

సార్జంటు: అబద్ధం చెప్పావంటే డొక్క వాలికలు చేస్తా. తెలుసా. ఇదిగో. ఈ రూపాయి తీసుకో.

చినగంగు: (రూపాయి కేసి చూడకుండా) నా కది వద్దు. నాకు మా అన్నయ్య కావాలి. తీసుకురండి మరి. నాకేం కావలిస్తే అది ఇస్తానన్నారుగా?

సార్జంటు: నిజమే. ఇప్పుడూ అల్లాగే అంటాను. మీ అన్నయ్యను తీసుకురావడం మట్టుకు సాధ్యం కాదు – (వెనక్కి చూడకుండా పెద్ద పెద్ద అంగలేసుకుంటూ, కుటీరంలోంచి నడచి వెళ్ళిపోతాడు. చినగంగు బిక్కమొహం పెట్టాడు. కొంతసేపైన తర్వాత నేలమీద పడిఉన్న రూపాయిని తీసి కోపంతో కిటికీలోంచి బయటకు గిరవాటు వేస్తాడు. ఇంతలో దూరంలో తుపాకి ప్రేలిన ధ్వని వినిపిస్తుంది. పుతలీ ఉలిక్కిపడుతుంది. చినగంగు భయంతో వెళ్ళి తల్లిని కౌగలించుకొంటాడు.)

చినగంగు: అమ్మా! ఆ శబ్దం ఏమిటే?

పుతలీ: అన్నయ్య కైలాసగిరి ఎక్కుతోంటే దేవతలు దుందుభి మ్రోగించారు.

చినగంగు: అమ్మా! దుందుభి అంటే తుపాకీయా?

పుతలీ: (వినిపించుకోకుండా– కిటికీ దగ్గరకు వెళ్ళి) నాయనా – నీ జీవితమొక విజయోత్సవమైంది. అదే నాకు సంతోషం. నీ దేశభక్తి నివాతదీపకళిక... మంచుకంబళిలో కెంపులు జలజల రాలిఉంటాయి. ఇవి నా గుండెనుండి ఉదయించినవే. కరడుకట్టిన సుధాధారలు! ఓ, దయామయుడా! ఈనాటి ఆత్మబలి ధ్రువతారయి పదికాలాలపాటు భారతదేశంలో వెలుగు జిలుగులు ప్రసరించినట్లు అనుగ్రహించు!

[చిన్నగంగు తల్లికేసి నివ్వెరపోయి చూస్తూ నిలబడిపోతాడు. మెరుపు తళ్ళొత్తుతుంది. విద్యుల్లతలో దూరంలో ఎరను మింగిన నాగుబాములా నిశ్చలంగాపడి నిద్రపోతున్న మణిపూరు నది అగుపడుతుంది]. ★

# గోడమీద గడియారం

గోడమీద గడియారం ఎనిమిదిసార్లు కొట్టింది. సరిగ్గా అదేసమయానికి స్టేషన్లో రైలుకూత వినబడింది.

రమాకాంతం పేపర్లోంచి ముఖం తొలగించి భార్యతో

"మన గడియారం ఎనిమిది కొట్టింది - స్టేషన్లో రైలు కూత వేసింది. కరక్టయిన టైం అంటే అట్లా ఉండాలి. పద్నాలుగు సంవత్సరాల్నుంచి చూస్తున్నాం. మన గడియారం ఎన్నడైనా నిముషం స్లో గానీ, నిముషం ఫాస్టు గానీ ఆడిందీ......మళ్లా ఊళ్ళో వందలకొద్దీ గడియారాలున్నాయి..."

లక్ష్మీకాంతమ్మ రోజూ వినే సోదేగదా అని వంటఇంట్లోకి వెళ్ళింది.

రమాకాంతం నిండైన సంతోషంతో గోడమీద గడియారంకేసి చూశాడు.

పైళ్ళివేటు పిల్లలు వరండాలో నిశ్శబ్దంగా పాఠాలు చదువుకొంటున్నారు. కొంతమంది లెక్కలు చేసుకుంటున్నారు. మరి కొంతమంది అతిమెల్లగా కబుర్లు చెప్పుకుంటున్నారు. పేపరు చదువుకోవడంఅయింది కనుక రమాకాంతం - వాళ్ళకి పెద్దగా చదువుకోమని ఆజ్ఞ ఇచ్చాడు వెంటనే వాళ్ళు 'ఇక్కడ ఒక స్కూలు ఉంది' అనే విషయాన్ని బయటవాళ్ళకు తెలియచేసేందుకు బిగ్గరగా చదవనారంభించారు.

ఏదో విషయం గుర్తుకు రాగా వెంటనే కుర్చీలోంచి లేచి, రమాకాంతం వంటగదిలోకి వెళ్లాడు.

"ఏమే! ఇవాళ మన ప్రబుద్ధుడు వస్తాడు కదూ! ఈ బండిలోనే రావాలి. పరీక్షలు ఎట్లా రాశాడో, ఏమిటో! ఉత్తరాల్లో మటుకు మహాజోరుగా రాసినట్టు రాస్తాడు"

"వాడికేం! బాగా నే రాస్తాడు." అన్నది లక్ష్మీకాంతమ్మ కూరలో ఉప్పు వేస్తూ.

"అవును. గీత కలిసిరాక ఇన్నిసార్లు బోల్తా కొట్టాడు కానీ..."

లక్ష్మీకాంతమ్మ ముఖం చిట్లించుకుంది.

"అది కూడా వాడి నేరమేనా?"

"కాదు. వాడి చదువుకు వందలకి వందలు ధారపోసిన మన నేరం."

లక్ష్మీకాంతమ్మ మళ్ళీ ముఖం చిట్లించుకుంది.

ఇంతలో బయటినుంచి కేక. రమాకాంతం వరండాలోకి వెళ్ళాడు.

పురుషోత్తం మాట్లాడలేదు. ఆలోచనలో

"ఓ! మీరా! రండి నారాయణమూర్తిగారూ!" అహ్వానించాడు రమాకాంతం.

"ఆఁ! ఏంలేదు. మావాడు ఎట్లా చదువుకున్నాడో చూసిపోదామని." బెంచీమీద కూర్చున్నాడు నారాయణమూర్తి.

"మీ వాడికేం చిచ్చంద్రీ! ఏదో ఎక్కాం? వొప్పజెప్పమంటే - తొమ్మిదో ఎక్కం కూడా వొప్పజెబుతాడు. వాడి బాబాయిలాగా మంచి తెలివితేటలుగలవాడవుతాడు." అన్నాడు రమాకాంతం.

నవ్వుకున్నాడు నారాయణమూర్తి.

కొంచంసేపు ఆ కబురూ, యీ కబురూ చెప్పుకున్నారు. నారాయణమూర్తి గోడమీద గడియారానికీ, తన చేతిగడియారానికీ టైం చూసుకున్నాడు. తన చేతిగడియారం పదినిముషాలు ఎక్కువ వుండటంతో—

"మీ గడియారపు టైం..."

"చాల కచ్చితం. మీరు సందేహించా

## తాళ్లూరి నాగేశ్వరరావు

ల్సిన పనిలేదు. ఈ గడియారం నా ఇంట్లోకి వచ్చి పద్నాలుగు సంవత్సరాలైంది. అప్పట్నుంచీ ఇప్పటికి ఒక్క నిముషం ఎక్కువ గానీ, తక్కువగానీ ఆడి ఎరుగదు."

"చాల విడ్డూరంగా ఉంది."

"వినేవాళ్లకు అట్లానే ఉంటుంది నిజం. 'కీ' నా చేతిమీదుగా. నిత్యమూ ఉదయం ఏడుగంటలకి ఇస్తాను. ఇంతవరకు రిపేరుకు రూపాయి కర్చుపెట్టలేదు. మరి ఆశ్చర్యంగానే ఉంటుంది, వినేవాళ్ళకు"

"ఎన్ని రూపాయలకు కొన్నారు?" అన్నాడు నారాయణమూర్తి కుతూహలంగా.

రమాకాంతం గర్వంగా ఒక్క చిరునవ్వు నవ్వి,

"నేను కొనలేదు. బందరులో ఉద్యోగం చేస్తూన్న రోజుల్లో నరసింహం అనే ఒక షావుకారు, తన కొడుకుని హైస్కూల్లో చేర్పించగా కానిఇచ్చాడు. ఆ రోజుల్లో పెద్ద ఖరీదే!"

"కనుకనే ఇంత గట్టిగా పనిచేస్తూంది. ఇటువంటి గడియారాలు ఇప్పుడు రావటం లేదండీ. క్రితం సంవత్సరం ఒక గోషగడియారం తెచ్చాం. ప్రస్తుతం రిపేరులో ఉంది—"

"అంతే మరి—" నవ్వుకున్నాడు రమాకాంతం.

"వెళ్ళొస్తాను."

"మంచిది"

నారాయణమూర్తి వెళ్ళిపోయాడు. ఆయన గుమ్మందాటగానే, జట్కాబండి వొచ్చి ఆగింది. బండిలోంచి రమాకాంతం కొడుకు పురుషోత్తం, దిగాడు. బండివాడు సామాను తెచ్చి లోపలపెట్టాడు. పురుషోత్తం వాడికి డబ్బులిచ్చాడు. లక్ష్మీకాంతమ్మ కాళ్లకు నీళ్లు యిచ్చింది.

"పరీక్షలు ఎట్లా రాశావురా?" అన్నాడు రమాకాంతం.

"బాగానే రాశాను. గట్టిగా ప్యాసవుతాను."

"నెంబరెంత?"

"6474."

ఆరోజు రాత్రి భోజనాలు అయింతరువాత రమాకాంతం కొడుకుతో ఒకవిషయం చర్చించదలచి, స్నేహితుని ఇంటికి వెళ్లే పురుషోత్తాన్ని వుండమన్నాడు. పురుషోత్తం బెంచీమీద కూర్చున్నాడు. తండ్రీ-కొడుకుల విషయాలు వినేందుకు లక్ష్మీకాంతమ్మ మండిగంమీద కూర్చున్నది.

"ఈ సంవత్సరం నీకు పెళ్లిచేయాలని ఉన్నది" అన్నాడు రమాకాంతం.

పురుషోత్తం మాట్లాడలేదు.

"బాపట్లలో ఒక సంబంధం ఉంది. అన్నివిధాలా న నచ్చింబంధం. కట్నం కానుకలూ మనం కోరినవన్ని ఇస్తారు. పిల్ల ఫిఫ్తుఫారం వరకూ చదువుకొన్నది. అందచందాలంటావా - వంక పెట్టాల్సిన పనిలేదు. ఏమంటావు?"

# ★ గోడమీద గడియారం ★

పడ్డాడు. కాని లక్ష్మీకాంతమ్మ మూతి మూడు వంకర్లు తిప్పింది. ఈ సంబంధం ఆవిడకు ఏమాత్రం ఇష్టంలేదు. ఆవిడ బంధువుల్లో ఒక పిల్లఉంది. ఆ పిల్లనిచ్చి చేయాలని ఆవిడ పట్టుదల. కాని ఆ సంబంధం రమాకాంతానికి ఇష్టంలేదు. కొడుకు పెళ్ళివిషయంలో ఆ దంపతుల అభిప్రాయాలు పట్టుదలలు - వేర్వేరుగా ఉన్నాయని వేరే చెప్పనవసరంలేదు.

"అట్లా మెదలకండా వూరుకుంటే లాభంలేదు. ఇప్పటికే ఆలస్యమైంది."

అప్పుడే పెళ్ళి పురుషోత్తానికి ఇష్టంలేదు. కాని ఆ విషయం తండ్రికి ఎలా చెప్పడం? కస్సుమని లేస్తాడేమో!

"నిన్ను అడగడమేమిటి నేను. నీ క్షేమం కోరేవాణ్ని నేను, నాకు తెలియదూ! రేపు సాయంకాలం వెళ్ళి, ముహూర్తం నిర్ణయించమని చెప్పివస్తాను" అన్నాడు రమాకాంతం అధికారంతో.

పురుషోత్తం విసురుగా తల ఎత్తాడు ఏదో మాట్లాడాలని. కాని ఏం మాట్లాడలేకపోయాడు.

లక్ష్మీకాంతమ్మ ఉండబట్టలేక—

"అప్పుడే వాడికి పెళ్ళేమిటండీ. నిండా ఇరవై యేళ్ళు నిండలేదు ఇష్టం లేకనే, ఆ విషయం మీదగ్గర చెప్పలేక నచ్చుకొడుతున్నాడు" అన్నది.

రమాకాంతం కోపంగా "నీ కిష్టంలేదనరాదూ! పైగా వాడ్ని చెడగొడతావేం? మీ సుభద్రమ్మ కూతురుకంటె లక్షరెట్లు అందమైంది. మీ ఇష్టాయిష్టాలతో నాకు నిమిత్తం లేదు. రేపు వెళ్ళి అవునని చెప్పివస్తాను" అన్నాడు.

ఆమీదట లక్ష్మీకాంతమ్మ గానీ, పురుషోత్తం గానీ మాట్లాడలేదు. పురుషోత్తం స్నేహితుని ఇంటి కెళ్ళాడు.

మరునాడు పదకొండున్నర గంటలకు భోంచేసి, మంచంమీద పడుకొంటూ - భార్యతో—

"నిద్రపోతున్నా గానీ; మధ్యాహ్నం రెండు గంటలకు లేపు. మూడు గంటల బండికి బాపట్ల వెళ్ళాలి. తప్పకుండా లేపు" అని నిద్రపోయాడు రమాకాంతం.

ఎట్లాగైనా భర్త బాపట్ల వెళ్ళకుండా ఉండే ఉపాయం ఆలోచించాలని లక్ష్మీకాంతమ్మ వొకగంటసేపు ఆలోచించింది. ఆ సంబంధం చెడిపోతే, పెళ్ళి మరి కొన్నాళ్ళకు వాయిదా పడుతుంది. గడియారం ఒంటిగంటకు ఒకసారి పలికింది. గోడమీద గడియారం కేసి చూడడంతోటే లక్ష్మీకాంతమ్మకు ఒక ఆలోచన తట్టింది.

భర్తకు 3 15 ని. వచ్చే బండి అందకపోతే, ప్రయాణం ఆగిపోతుంది. భర్తకు బండి అందకుండా ఎట్లాచేయటం? గోడమీద గడియారపు టైం ఒక అరగంట వెనక్కు తిప్పితే సరి! గోడగడియారం మీద భర్తకు మంచి నమ్మకం - ఆలస్యంగా ఆడదని.

ఇంట్లో పురుషోత్తంకూడా లేడు. స్నేహితుని ఇంటికివెళ్ళాడు, పేకాట ఆడుకొనేందుకు. అదే మంచి సమయమని లక్ష్మీకాంతమ్మ డ్రాయరు చప్పుడుకాకుండా ముందుకులాగి, దానిమీద ఎక్కి గోడ గడియారంలో టైం అరగంట వెనక్కు తిప్పింది.

రెండు గంటలు కాగానే లక్ష్మీకాంతమ్మ భర్తను లేపింది. రమాకాంతం లేచి ముఖం కడుక్కొని, కొత్తబట్టలు వేసుకొని, కాఫీ త్రాగేప్పటికి 2.45 ని. అయింది. 3-15 ని. రైలు. స్టేషను ఒక మైలుదూరం ఉంటుంది. ఎప్పుడు బయలుదేరినా రమాకాంతం రైలు వచ్చే వేళకి అరగంట ముందుగా బయలుదేరి వెళతాడు. ఆరోజుకూడా అరగంట ముందుగా బయలుదేరాడు.

ఊరుదాటి షావుకారుగారి అరటితోట దగ్గరకి వచ్చేటప్పటికి స్టేషన్లోకి బండి వచ్చింది ఇంకా నాలుగు ఫర్లాంగులదూరం ఉంది. ఎట్లా పరుగెత్తుతాడు? రమాకాంతానికి విపరీతమైన ఆశ్చర్యం వేసింది. బండి ఇంతముందుగా ఎట్లావొచ్చింది? టైం మార్చారా? లేక తన గోడగడియారం... ఛ. ఛా. ఎప్పటికీ 'స్లో' ఆడదు.

రోడ్డున పోతున్న ఒక పెద్దమనిషిని టైం అడిగాడు రమాకాంతం.

ఆయన చేతిగడియారం చూసి 3-20 అని చెప్పాడు.

రమాకాంతం తలక్రిందులైనాడు.

"మీ టైము కరక్టేనాండీ!" అన్నాడు ఆ పెద్దమనిషిని.

ఆయన రమాకాంతంకేసి వింతగా చూస్తూ తన దారిని తాను వెళ్ళాడు.

రమాకాంతానికి ఏమీ తోచలేదు. నిజంగా తన గడియారం 'స్లో' ఆడిందా? కాకపోతే ఈ విపరీతం ఏమిటి? ఇంటికి వస్తూ రమాకాంతం త్రోవలో ఇద్దర్ని ముగ్గుర్ని అడిగాడు 'టైమెంత?' అని. వాళ్ళుకూడా అయిదు నిముషాలు అటో ఇటో యించుమించుగా 3 20 చెప్పారు. ఆ టైమే కరెక్టని నమ్మటంకంటె మరో దారి కనిపించలేదు రమాకాంతానికి. గబగబా యింటికి వచ్చాడు.

రావటంతోటే గోడ గడియారం కేసి చూశాడు. 2-55 ని. అయింది. వొళ్ళు)

ఆ ఆఫీసులో ఒక ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకొన్న ఒక అభ్యర్థి అధికారిముందు నిలబడ్డాడు.

"నీ వయస్సు ఎంత?" అధికారి గర్జించాడు.

"నలభై"

"క్రితంసారి నువ్వు పని చేసినచోట ఎన్నేళ్ల అనుభవం వుంది నీకు?"

"ఏభై"

"ఆ! ఏభైయా? నాతో వేళాకోళం ఆడదలచుకొన్నావా? నీ వయస్సు నలభై అయితే ఏభై ఏళ్ళ అనుభవం ఎలా వుందంటావ్ నీకు?"

"దానికేముందండీ! ఓవర్ టైమ్ వర్కు చేశాను."

మండింది. ఏం తోచలేదు. నిజంగా తన గడియారం 'స్లో' ఆడుతోంది.

"గడియారాన్ని ఎవరేనా కదిలించారా?" అన్నాడు గట్టిగా. లక్ష్మీకాంతమ్మ లేదని చెప్పింది.

"మరి 'స్లో' ఎందుకు ఆడుతూంది?"

"ఎవరన్నారు?" ఏమీ తెలీనట్టు అంటూన్నది లక్ష్మీకాంతమ్మ.

"ఎవరనేదేమిటి, నీ మొహం. అరగంట 'స్లో' ఆడుతూంది. నాకు రైలు అందలేదు. ఎన్నడూ 'స్లో' ఆడనిది, ఇవాళ ఎందుకాడిందీ! మన వెధవాయి ఏమన్నా కదిలించాడా?"

"లేదండి! ప్రొద్దున మీరు ఏడుగంటలకు 'కీ' ఇవ్వటమే!"

"ఒకవేళ 'కీ' ఇచ్చేటప్పుడు పెద్దముల్లు వెనక్కు తిరిగిందేమో!"

"చోద్యంగా ఉంది. ఎక్కడేనా 'కీ' ఇస్తూంటే ముల్లు వెనక్కు ఎట్లా తిరుగుతుందండీ?...ఏమో! ఒకవేళ తిరిగిందేమో!"

"ప్రయాణం ఆగిపోయింది. వెధవది అదిలోనే...రాత్రి బండికి వెళదామంటే బాగుండదు. ఇప్పటికే ఆలస్యం అయింది. రేపు తెల్లవారుఝామున బండికి వెళతాను" చాటుగా నవ్వుకుంది లక్ష్మీకాంతమ్మ.

ప్రక్క ఇంట్లో వారి టైంచూసి గోడ గడియారానికి సరైన టైం పెట్టాడు రమాకాంతం.

ఆరాత్రి అందరూ గాఢనిద్రలో ఉండగా పన్నెండుగంటల సమయంలో లేచి, లక్ష్మీకాంతమ్మ - మళ్ళీ గోడగడియారంలో టైం అరగంట వెనక్కు తిప్పింది. ఎవ్వరికీ తెలీకుండా చప్పుడు కాకుండా పడుకుంది.

అలవాటు చొప్పున గోడమీదనున్న గడియారం అయిదుసార్లు కొట్టగానే లేచాడు రమాకాంతం. పావుగంటలో కాలకృత్యాలు ముగించుకొని, కొత్తబట్టలు ధరించి - స్టేషనుకు వెళ్లేందుకు గుమ్మం దాటగానే స్టేషన్లో రైలు కూత వేసింది. రమాకాంతం నిలువునా నీరైపోయాడు. ఇంట్లోకొచ్చి గోడగడియారం కేసి చూశాడు. 5-20 అయింది. 5-45 కు బండి. అప్పుడే ఎట్లా పోయింది? మళ్ళీ గడియారం 'స్లో' ఆడుతూందా?

లక్ష్మీకాంతమ్మ బద్ధకంగా లేస్తూ - "ఇంకా స్టేషనుకు వెళ్లలేదుటండీ" అన్నది.

"నా ముఖం అప్పుడే బండిపోయింది."

"ఎట్లాపోయింది. ఎంతైందీ టైం?"

"మళ్లీ 'స్లో' ఆడుతూన్నది"

"చెడిపోయిందేమో!"

"ఎటా చెడిపోతుంది? ఎవ్వరో కదిలించి ఉండాలె"

"దాని జోలి ఎవరికి పట్టిందండీ!"

"మరి ఎట్లా చెడిపోతుంది?"

"కాలం కలిసిరాకపోతే అదే చెడిపోతుంది. మనకు చెప్పి చెడిపోతుందా?"

తెల్లవారగానే ప్రక్క ఇంటి గడియారం టైముతో పోలిస్తే అరగంట 'స్లో' కనపడింది. రమాకాంతం చాల బాధపడ్డాడు. కొంతసేపు పురుషోత్తాన్ని కేకలు వేశాడు, వాడేమన్నా కదిలించాడేమోనని.

భోజనం చేసింతరువాత, ఒక అరగంట ముందుగా స్టేషనుకు వెళ్ళి - పన్నెండు గంటల బండిలో రమాకాంతం బాపట్ల వెళ్లాడు.

* * *

బాపట్లలో స్నేహితుడు వెంకటనరసయ్యతో కలిసి పెళ్లికూతురు తరుఫు వాళ్ల ఇంటికి వెళ్ళాడు రమాకాంతం.

వెంకటనరసయ్య అన్నాడు పెళ్ళికుమార్తె తండ్రితో.

"మీ అమ్మాయిని..."

"సంబంధం నిర్ణయించటం అయిపోయిందండీ మా బంధువుల్లోనే ఒక పిల్లవాడికివ్వదలచాం. ప్రొద్దునే వాళ్ళువాళ్లు వచ్చి ఖాయంచేసుకొని వెళ్ళారు. మీరు చాల ఆలస్యం చేశారు. నిన్న వొచ్చినా బాగుండేది. మీరుచేసిన ఆలస్యాన్ని బట్టి - మీకు అక్కర్లేదేమో అని, ప్రొద్దునే మాట ఇచ్చాను" అన్నాడు పెళ్ళికూతురు తండ్రి.

రమాకాంతం హృదయం జివ్వుమన్నది.

ఆ ఇంట్లోంచి బయటకొచ్చి స్టేషను చేరుకున్నాడు.

వెంకటనరసయ్య - "ఇక నేను వెళ్లివస్తా" అని వెళ్ళిపోయాడు.

రమాకాంతం కోపంతో జ్వలించిపోతున్నాడు. ఆయనకోపమంతా తన గోడ మీద గడియారంమీదే! దానివల్లే తన కొడుక్కు సంబంధం చెడిపోయింది. నిన్న - ఇవాళ ప్రొద్దున అరగంట 'స్లో' గా ఆడకపోతే - తను బాపట్ల వెళ్ళిఉండేవాడు! కొడుక్కి సంబంధం నిశ్చయంఅయిపోయేదే!

రైల్లోకూడా గడియారాన్ని గురించే ఆలోచన రమాకాంతానికి.

ఇంటికొచ్చాడు. ఆరాత్రి తలుపు తట్టగానే లక్ష్మీకాంతమ్మ వీధి తలుపు తీసింది. గబగబా ఇంట్లోకి వచ్చాడు.

గోడమీదినున్న గడియారం పదిసార్లు కొట్టింది. లక్ష్మీకాంతమ్మ గ్లాసులో నీళ్లు తెచ్చేందుకు పెరట్లోకి వెళ్ళింది. పురుషోత్తం నిద్రపోతున్నాడు.

రమాకాంతం గోడమీది గడియారాన్ని క్రిందకులాగి నేలకేసి విసిరికొట్టాడు. అసలే ఆయనకు కోపంఎక్కువ. ఆ కోపంలో వొళ్లు తెలీదు. ఏంచేస్తాడో కూడా తెలీదు. ఆ చప్పుడుకు పురుషోత్తం ఉలిక్కిపడి లేచాడు. లక్ష్మీకాంతమ్మ బిందెలోనుంచే చెంబును అట్లాగే వొదిలి పరుగెత్తుకుంటూ వొచ్చింది.

"ఏమిటండీ - ఈఅఘాయిత్యం?"అన్నది లక్ష్మీకాంతమ్మ.

"ఈ తప్పుడు గడియారం మనింట్లో అక్కర్లేదు" అన్నాడు రమాకాంతం కసిగా.

"తప్పుది కాదండీ!"

"ముమ్మాటికీ తప్పుదే. నువ్వు నాకు చెప్పక్కర్లేదు"

లక్ష్మీకాంతమ్మ నోరు నొక్కుకుంది. తన అవివేకంవల్లనే బంగారంలాంటి గోడ గడియారం నాశనం అయిందని బాధపడింది.

మరునాడు తెల్లవారుఝామున అలవాటు చొప్పున రమాకాంతం అయిదుగంటలకు లేవలేదు. కారణం—గోడమీద గడియారం అయిదుసార్లు పలక్కపోవటమే!



# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 188. హైడ్రోజని బాంబు రహస్యం

సూర్యగోళ గర్భంలో నాలుగు హైడ్రోజని కేంద్రకాలు ఒక హీలియం కేంద్రకంగా ఏర్పడుతుంటాయి ఆ సందర్భంలో కొంత ద్రవ్యం నష్టమై శక్తిగా ప్రత్యక్షమౌతుంది అదీ పరమాణుశక్తియే వేడీ వెలుగులరూపంలో సూర్యుడు కలకాలం నుంచి విరామం లేకుండా ప్రదేశం లోనికి పంపిస్తున్న మహత్తర శక్తి యీవిధంగా ఉత్పన్నమైనదే నక్షత్రాలకు కూడా శక్తి వానిలో ఉన్న తేలికయైన మూలపదార్థాలు అంతకంటె బరువైన మూలపదార్థాలుగా సంయోగం చెందడంవలననే చేకూరుతున్నది. ఈ ప్రత్యక్ష నిదర్శనాన్ని ఆధారం చేసికొని, తేలికయైన మూలద్రవ్య కేంద్రకాలను సమ్మేళన మొనర్చడంవలన భూమిపై కూడా పరమాణుశక్తిని జనింపచేయవచ్చునని శాస్త్రజ్ఞులు భావించేరు ఆవిధంగా పరమాణుశక్తిని జనింపచేయడంలో కృతకృత్యులు కూడా అయ్యేరు. నాలుగు హైడ్రోజని కేంద్రకాలు ఒక హీలియం కేంద్రకంగా మార్పునొందడంలో జనించిన పరమాణుశక్తితో ప్రేలినదే హైడ్రోజని బాంబు

హైడ్రోజని బాంబు నిర్మాణం యురేనియం బాంబు నిర్మాణంకంటె ఒకవిధంగా కష్టమైనది. బరువైన మూలద్రవ్య కేంద్రకాలను బ్రద్దలుకొట్టడంకంటె తేలికయైన మూలద్రవ్య కేంద్రకాలను కలపడం అంటే సమ్మేళన మొనర్చడం కష్టం. అందుకు మిక్కిలి ఎక్కువ తాపక్రమం కావాలి. యురేనియమ్, ప్లూటోనియమ్ బాంబుల వంటి ఫిషన్ బాంబులను తయారుచేయడాన్ని తెలిసికొన్న తర్వాత తేలికయైన మూలద్రవ్య కేంద్రకాలను సమ్మేళన మొనర్చడానికి కావలసిన ఉష్ణశక్తి అంతా చేకూరింది. తన్మూలంగా హైడ్రోజని బాంబు నిర్మాణం సాధ్యమైంది.

హైడ్రోజని బాంబులోని ద్రవ్యమంతా పెద్ద ఉక్కు కవచంలో ఉంటుంది ఆ కవచంలోనే యురేనియమ్ బాంబో, ప్లూటోనియమ్ బాంబో కూడా ఒకటి ఉంటుంది. హైడ్రోజని బాంబులోని హైడ్రోజని కేంద్రకాలు సమ్మేళన మొందడానికి కావలసిన అత్యధిక తాపక్రమాన్ని యీ యురేనియమ్ లేదా ప్లూటోనియమ్ ఫిషన్ బాంబు సమకూరుస్తుంది. హైడ్రోజనిబాంబును పేల్చివేసిన వెంటనే దానిలోని ఫిషన్ బాంబు ముందు ప్రేలి, హెచ్చు తాపక్రమం ఏర్పడడం, ఆ తాపక్రమానికి హైడ్రోజని కేంద్రకాలు సమ్మేళనమొంది ఎక్కువ పరిమాణంలో పరమాణుశక్తి విడుదలయి పెద్ద ప్రేలుడు సంభవించడం సెకనులమీద జరుగుతుంది. 1954 వ సంవత్సరం మార్చి 1 వ తేదీని పసిఫిక్ మహాసముద్రంలోని ఎనివెటోక్ అనే ప్రాంతంలో మొట్టమొదటి సారిగా హైడ్రోజని బాంబును అమెరికనులు ప్రేల్చేరు. రష్యావారు కూడా హైడ్రోజనిబాంబును తయారుచేయడంలో కృతకృత్యులైనారనీ అమెరికావారికిముందే వారా బాంబును ప్రేల్చియున్నారనీ చాలమంది అంటారు

పరమాణు విచ్ఛేదనమువలన జనించిన పరమాణు శక్తికంటె పరమాణు కేంద్రకాల సమ్మేళనంవలన జనించిన పరమాణుశక్తి చాల ఎక్కువగా ఉంటుంది. పైగా యురేనియమ్, ప్లూటోనియమ్ బాంబులను పరిమితమైన ఒక పరిమాణంకంటె పెద్దవిగా తయారుచేయలేము. కాని హైడ్రోజని బాంబులను ఎంత పెద్ద పరిమాణంలో కావలసివస్తే అంత పెద్ద పరిమాణంలోనూ తయారుచేయవచ్చును అందుచేత నేయురేనియమ్ ప్లూటోనియమ్ బాంబులకంటె హైడ్రోజని బాంబు విధ్వంసక సామర్థ్యం తప్పనిసరిగా ఎక్కువగా ఉంటుంది. హిరోషిమాపై వేసిన బాంబుకంటె 1954 సంవత్సరం మార్చి 1 వ తేదీని ఎనివెటోక్ దగ్గర ప్రేల్చిన హైడ్రోజని బాంబు ఐదు వందల రెట్లయినా శక్తిమంతమైనదట! సామాన్యమైన ఒక హైడ్రోజని బాంబు ప్రేలినపుడు, బాంబుపడిన ప్రదేశానికి ఎటు చూసినా 4 మైళ్ళ దూరంలోగల సమస్త వస్తుజాలమూ పూర్తిగా నాశనమైపోతుంది; ఎనిమిది మైళ్ళ దూరంలోనున్న దానికి అపార నష్టం కలుగుతుంది; 14 మైళ్ళ దూరంలోనున్న దానికి హెచ్చు నష్టం ఉంటుంది; 25 మైళ్ళ దూరంలోనున్న దానికి కొద్ది నష్టం ఉంటుంది. ఇక హైడ్రోజని బాంబు ప్రేలినపుడు కలిగెడి ఒక రకమైన కిరణాలవలన ఆ కిరణాలు ఎన్ని వందల మైళ్ళు ప్రయాణం చేస్తాయో అంత ప్రదేశంలోనూగల దేశాల ప్రజల ఆరోగ్యం దెబ్బతింటుంది! హైడ్రోజని బాంబులకు దేశదేశాలవారు భయపడుతున్నది ఇందువలననే!

—అనంత్.

★

## చిట్టిప్రశ్నలకు జవాబులు

వి. రంగభాస్కరరావుగారు, నాగాయలంక.

—సంస్కృత మనగా సంస్కరింపబడిన భాష. వేదకాలమునుంచి పురాణరచనాకాలము వరకూ ఆర్యులు వ్యవహరించుచుండిన భాష. ఈనాటి సంస్కృతమే కాకపోయినమా దాని కిట్టరాకమాత్రము నేటి సంస్కృతమునకు బాగా సన్నిహితమైనదే! ఆ భాషయే ఆర్యుల వ్యవహారములోనుండిన భాష. ఇదే ఆర్యుల ఆగమనముతో భారతదేశమున ప్రవేశించినది. ఆర్యుల రాకకుపూర్వము మనదేశమును ఆక్రమించియుండినవారు ద్రావిడులు. అనగా అప్పుడు మనదేశమున వ్యాపించియుండినదికూడ ద్రావిడ భాషయే నన్నమాట ఆర్యుల రాకతో దక్షిణమునకు తరలిపోయిన ద్రావిడులవల్ల పర్వత శ్రేణుల అడ్డంకులవల్ల కాలక్రమమున తమిళమూ,

"నేను వందేళ్లు బతుకు తానా డాక్టరుగారూ?"

"ఇప్పుడు మీ వయస్సు ఎంత?"

"నలభై"

"పొగ తాగటం, జూద మాడటం, మద్యపానం వగైరా అలవాట్లు ఏమైనా వున్నాయా మీకు?"

"లేవండి. అలాంటి అల వాటు ఒక్కటికూడా లేదు."

"ఐతే అటువంటి బతుకు యింకా అరవై ఏళ్లు ఎందుకండి బతకటం?"

* * *

"ఏమోయ్ పార్వతీశం, షేక్స్పియర్ లా మొఖం వేల వేశావ్?"

"ఏంలేదోయ్ బ్రదర్! ఈమధ్య రాత్రుల్లు నిద్రపోయే టప్పుడు మహా భయంకరంగా గురకపెట్టేస్తున్నాను. ఆ గురకి మూలంగా మెళుకువ వచ్చే స్తోంది. "ఏం చెయ్యాలో బోధ పడటం లేదు."

"దాని కేముంది? మెళుకువ రాగానే పక్క గదిలోకి పోయి పడుకో!"

తెలుగూ, కన్నడమూ, మళయాళమూ అను భాషలుగా విడిపోయినదని తజ్ఞుల అభిప్రాయము.

క్రీస్తుపూర్వ శతాబ్దములలోనూ తర్వాత కొంతకాలము వరకునూ వంగ దేశములో పాళీ భాష తెలుగుదేశమున ముఖ్యముగా ప్రాకృతభాషా వాడుకలో నుండినట్లు ఆ కాలమునాటి శాసనముల మూలమున తెలిసి కొనవచ్చును.

ప్రపంచ భాషలలో ఏది ప్రాచీనమో చెప్పుటకు మా కధికారము చాలదు. కాని నైలునదీ తీరమున బయలుదేరిన నాగరికత అతిప్రాచీనమని పురాతత్వవేత్తల అభిప్రాయము. లిపి పొందిన ప్రాచీన భాష లలో నైలునదీ తీరమువారి భాషయే అతి ప్రాచీన మనవచ్చునని అనుకుంటాము.

హిమాలయ ప్రాంతములనుండి ఆర్యుల ధాటినోర్వక ద్రావిడులు దక్షిణాదికి తరలి పోయినా బెలూచిస్థానములో ఒకచోట మాత్రము పర్వతశ్రేణి రక్షణను పొంది కొందరు మిగిలియుండిరట. వారి నేటిభాష "బ్రూహి", ద్రావిడభాషకు సన్నిహిత ముట.

* * *

టి. శ్రీనివాసాచార్య, వాకాడు.

—శబ్దము అది పుట్టినచోటునుండి అన్ని వైపులకు సూటిగకుండా తిన్నగా రుజు రేఖలో ప్రసరించును. చీకటి గదిలో బల్లి పలికినప్పుడు అది ఏ వైపునుండి పలికినదో మనము గ్రహింపగలుగుదుముకదా! వేటలో అత్యంత ఆసక్తి కలిగిన దశరథ మహారాజు చప్పుడును విని దాని పుట్టిన చోటును సూటిగా కొట్టుట సాధకమువలన నేర్చి యుండును. శబ్దమునుబట్టి దాని కారణ మును భేదించు విద్య "శబ్దభేది విద్య" అని పేరుపడినది. అంతేకాని శబ్దభేది బాణము నే పేరుగల ప్రత్యేక బాణ మొకటున్నదని మా కనిపించుట లేదు.

—గ్రహణ కాలములో గర్భవతులు ముక్క తరిగినట్లున్న సూర్య చంద్రబింబ ములను చూచినచో వారికి పుట్టబోయే శిశు వులకు కూడ అటువంటి మొర్తి దాపురించు నన్నది కొందరి వట్టి నమ్మకము.

పుట్టిన శిశువుల అంగవైకల్యమునకు జననీ జనకుల రోగములు గానీ, వంశపారంపర్యత గానీ ఒక్కొక్కప్పుడు హటాత్ సంద ర్భము గానీ కారణములు. ఈ కారణములు తెలియనినాడు గ్రహణములు చూచుటా, పుచ్చుపండ్లను గానము చేయుటా మొదలగు నవి ఎన్నో శిశువుల అంగవైకల్యమునకు కారణములని భావదను లూహించినారు. సోదా చూచినచో దీని సత్యము బయటపడ గలదు.

* * *

వి. యస్. అంజనేయులుగారు,

రాజోలు.

—పువ్వుల వాసన వాటి ఉపయోగము కొరకే గాని తక్కిన ప్రాణులకు కాదు. తేనెకోసము పువ్వులలో దూరే తుమ్మె దలూ, పురుగులు, ఇతర కీటకములూ పూలకు పరాగ సంపర్కము జరుగుటకు సాయపడునని పాఠకులకు తెలుసును. ఉష్ణ దేశములలో ఎక్కువ పూల మొక్కలుం టాయి కనక, ఈ పోటీలో ఈగలను తమ వైపు ఆకర్షించుకోడానికి పూలు సుగంధ మును ధరించుచుండును. అందుననూ, రాత్రి వికసించు పూలకు రంగు సహాయ కారికాదు గదా! కనుక నే వాసన!

—ఉల్లిపాయ, క్యాబేజి, ముల్లంగి దుంపలలోనూ, పెసరపప్పులోనూ గంధకము కలదు. అవి ఉడుకుతూన్నప్పుడూ, వాటి గంజ కొంచెము మురిగినప్పుడూ ఉదజ గంధకితము అనే వాయువు వదలును. కోడి గ్రుడ్లలోకూడ గంధకముండును.

—సృష్టికి అతీతమైన రచన అతి లోక రచనయే. కళ అని ఎట్లందుము? చిత్రకా రుల "సుందరాంశులు" వారి మానస పుత్రి కలే. వారు సుందరాంగులెవరు కంటారో? నాకు తెలియదు. చిత్రకారులనే అడగాలి.

* * *

వేపా. భీమనాథశాస్త్రిగారు, అనకా పల్లి.

—మన సాహిత్యములో విషాద సారంగ ధర, విజయనగర పతనము, రోషనారా, వంటి విషాదాంత నాటకము లున్నవి. కాని మీరు చెప్పినట్లు బహుతక్కువ

నాటకములు విషాదాంతములుగా ఉండుటవల్ల ప్రేక్షకులకు ప్రయోజన మేమీ లేదని మనవారి నమ్మకము. ధర్మ విజయమును చూపుటే వారి ఆశయము.

—సినీమా, వాసన్ గారు సెల విచ్చినట్లు వినోదముకొరకే గాని విజ్ఞానము కోసము కాదు. ఆ యత్నము చేసిన సినీమాలు విద్యార్థులకే మాడలు!



సిద్ధార్థుడు సంబుద్ధి నొందిన
పుణ్యక్షేత్రం

# బుద్ధగయ

★

ఫొటోలు : సి. సీతారాం, మద్రాసు.





వజ్రాసనం.
ధ్యాన నిమగ్నుడైన
బుద్ధుడు కూర్చున్న పీఠం.




# స్త్రీలు ఉద్యోగాలు—కొన్ని లేఖలు

## కొమ్మూరి ఉషారాణి

"స్త్రీలూ ఉద్యోగాలు" అనే అంశంమీద, ఉద్యోగం చేస్తున్న ఒక వనితా, ఉద్యోగం చేస్తున్న ఒక స్త్రీభర్తా వారి అనుభవాలనీ, అభిప్రాయాలనీ తెలుపుతూ లేఖలు పంపారు. చాలా సంతోషం. ఉద్యోగంలో వున్న స్త్రీల భర్తలు ఒక్కరి తరఫునే కాదు,— వారి పిల్లలతరఫున కూడా మరొక 'గంధర్వుడో', 'కిన్నరుడో' రాసినా సంతోషంగా స్వీకరిస్తాం. వారి లేఖలను యిక్కడ ప్రచురించి సమాధానాలిచ్చాను. తతిమ్మా పాఠకులంతా ఉత్సాహంతో ఈ చర్చలో పాల్గొంటారని ఆశిస్తున్నాను.

"చిత్రలేఖ"గారు ఇలా వ్రాస్తున్నారు:

"'స్త్రీలు-ఉద్యోగాలు' అన్న శీర్షికలో శ్రీమతి కొమ్మూరి ఉషారాణిగారు వ్రాసిన వ్యాసం బాగుంది. కాని నాకు ఒక్క అనుమానం కలిగింది. ఇంతకూ ఆవిడ అనేది యేమిటి? ఆవిడ వుద్దేశ్యంలో స్త్రీలు వుద్యోగాలు చెయ్యాలనా, చెయ్యవచ్చుననా, లేకుంటే యింకేమేనానా? ఏ సంగతీ ఎందుకో విశదంగా వ్రాయలేదు. ఈ విషయంలో ఆవిడకే అనుమానాలు వున్నట్లు— ఆ వ్యాసమే వెల్లడిచేస్తుంది.

"ఉషారాణిగారు అన్నట్లు డిగ్రీలకోసమే చదివేవాళ్లూ, వరుడు దొరికేదాకా చదివేవాళ్ళూ వున్నారు. ఇలాంటివాళ్లే చదువుకొని వుద్యోగంచేసే స్త్రీలని అవహేళన చేసేది. ఉద్యోగంవల్ల ఎదుటివారికి కలిగే లాభనష్టాలూ, ఆత్మసంతృప్తి మొదలైన సంగతులు వీరికి తెలియవు సరికదా, అలాంటివి వున్నాయంటే కూడా నమ్మరు. శ్రీమతి ఉషారాణి ఎక్కడో రచయిత్రి వ్రాసిన కథను ఉదహరించారు కాని, అదే సంచికలో 'వనితాలోకం' శీర్షిక క్రిందనే ప్రచురితం అయిన టి. సావిత్రిగారి కథ సంగతి ఏమిటి? ఈ రోజుల్లో ఆడవాళ్ళని ఆడవాళ్లే చులకన చేసుకుంటున్నారు. అలాంటప్పుడు బైటప్రపంచం మనని గౌరవించాలనీ గౌరవిస్తుందనీ తలపోయడం కూడా పొరపాటేగానమే.

"భర్తని అనురాగంతో చూసే ప్రతి స్త్రీ అతనిభారంలో కొంత తనూ పంచుకోవాలని చూస్తుంది. విద్యావతి అయితే యీ కోరిక నెరవేరుతుంది. విద్యయొక్క తుది పరిణామం యిదేనేమో! అందరు వరులూ డాక్టర్లూ, అందరు పురుషులూ డైరెక్టర్లూ అవుతారా? చిన్న చిన్న వుద్యోగాలలో వున్నవాళ్ళు సంసారాలు నిర్మించుకొన్నారు. అలాంటప్పుడు భార్య వుద్యోగం చేస్తూ నిరుద్యోగి అయిన భర్తకి చేయూతనిస్తే తప్పేముంది! కన్యలు - వుద్యోగం చేస్తున్న కన్యలు-నిరుద్యోగులను వివాహం చేసుకొని వారికి భావిలో ఒక ఆశ, జీవితంలో ఒక సంతృప్తి యిస్తే తప్పేముంది? వివాహసమయంలో నిరుద్యోగి అయినా ముందు ముందు భర్తకూడా ఉద్యోగి అయి, హాయిగా వుండవచ్చును కదా! తారుమారు సినిమాను వుదహరించటం, సంసారం ఒకరు నడపాలనడం, కొంచెం చాదస్తంగా వున్నాయి. భార్యాభర్తలు అన్యోన్యంగా వుల్లాసపూరితంగా వుంటే సంసారం దానంతట అదే సాగుతుంది.

"సంసారంలో వడిదుడుకులు రాకుండా, స్త్రీలు - ఎవరినీ నొప్పించకుండా వుద్యోగాలు చేసే అవకాశాలు వున్నాయనే నా నమ్మకం. ఆర్థిక చిక్కులను వారు పరిష్కరించుకోగలరు. కాని

పనులూ ఎందుకు చేయకూడదు?" అని ప్రశ్నించారు ఉషారాణి ఎందుకు చెయ్యకూడదూ? ఎవరు వద్దన్నారు? అయితే నాదొక ప్రశ్న; స్త్రీలకి ప్రత్యేకించబడిన ఉద్యోగాలు 'యివి' అని ఏమైనా ఉన్నాయా? నాకు తెలిసినంతమటుకు, యివి స్త్రీలకి ప్రత్యేకం అని హోటలులో గదులలాగా, సినిమాల్లోనూ బస్సుల్లోనూ సీట్లలాగా, వుద్యోగాలు లేవు. అసలు స్త్రీలకి ప్రత్యేకించిన 'కోర్సులు' (కాలేజీలలో) ఉన్నాయా అని--ఒక్క *Domestic Science degree* కోర్సు, *Post - graduate Social Studies* కోర్సూ తప్ప. అలాంటి ప్రత్యేక ఉద్యోగాలలో ఒకటిగా పూర్వం నర్సింగు వుండేది. కాని దానిలోనూ యిప్పుడు *Male Nurses* వచ్చారు.

"ఆర్థిక స్వాతంత్ర్యంగురించి ఉషారాణి గారు ప్రస్తావించారు. ఆర్థికంగా పూర్తి స్వాతంత్ర్యం యే స్త్రీ కూడా అభిలషించదని నా నమ్మకం. కుటుంబంలో తాము *Earning- dependents* గా మాత్రమే వుండాలనే తత్వం స్త్రీలది. వేడి నీళ్ళకి చన్నీళ్ళు అన్నట్లు, భర్త సంపాదనకి, లేదా తండ్రి, అన్నల కుటుంబాలకి చేయూత. అంతే. నాకు తెలిసిన కొందరు అమ్మాయిలున్నారు: వారి సంపాదన వారి స్వంత సరదాలకేనని వారి నమ్మకం. సరదాలకి అంతెక్కడ? అయినా ఈ గడ్డు రోజుల్లో తల్లిదండ్రుల ఆర్థికదుస్థితిని చూస్తూ, భర్త చేసే బండచాకిరీ చూస్తూ, తమ సరదాలకోసమే సంపాదించుకొంటున్నామనే తత్వం హాస్యాస్పదంగా వుంటుంది. ఇప్పటివరకూ నే చెప్పినదంతా మధ్యతరగతి కుటుంబాలను దృష్టిలో పెట్టుకొనే.

"వ్యక్తిగతంగా నా అనుభవంగురించి చెప్తాను. ఒకటికి రెండు, మూడు డిగ్రీలున్నా లెక్కలేని యీ రోజుల్లో, నాకు డిగ్రీ రాగానే వుద్యోగం దొరికిందంటే అది నా అదృష్టమే. అది గవర్నమెంటు యిలాకా గుమాస్తావుద్యోగం. హేళనపాలయ్యేగుమాస్తా వుద్యోగం చెయ్యటం నాకా రోజుల్లో తలవంపులుగా తోచేది. కాని చెయ్యక తప్పలేదు. ఆ వుద్యోగంలో వున్నంతకాలం నే చదువుకొన్న చదువుకాని, నేను పెంచుకొన్న అభిరుచులుకాని ఆవంతయినా వినియోగానికి రాలేదు. నాలాగా కొత్తగా వుద్యోగంలో ప్రవేశించినవాళ్ళకి పని తెలియదు. తెలియకపోవటంలో ఆశ్చర్యం లేదు. సరిగ్గా అటువంటప్పుడే పని నేర్పే దాతా దూతా ఎవరూ వుండరు. కాని అక్కడున్న ఆ రోజుల్లో ఒక్కటిమాత్రం గ్రహించాను: నాలాంటి కొత్తవారికి పని రాకపోయినా, చాలాకాలంనుంచీ పని చేస్తున్న వాళ్ళు—అమ్మాయిలు — అన్ని విషయాలూ కూలంకషంగా తెలుసుకొని పెద్దపెద్ద సెక్రటరీలకి క్లర్కులుగా బాధ్యతాయుతమైన పనులు నిర్వహిస్తున్నారు. ఈ వుద్యోగంలో వుండి నే నెదుర్కొన్న మరీ గడ్డుసమస్యలూ పెద్దచిక్కులూ ఏమీ లేవు. ఒక్కటే చిక్కు; ఒక్కటే సమస్య - ఆర్థిక మాంద్యం. జీతం తక్కువ. (మనలో మనమాట, పనికూడా తక్కువే!) తరువాత, నా అభిరుచులకీ ఆశయాలకీ యీ వుద్యోగం ఎంతమాత్రం దోహదకారి కాలేకపోయింది. అందుకే వుద్యోగం మార్చే ప్రయత్నం చేశాను స్త్రీలకి ప్రత్యేకించింది ఎంతమాత్రం కాకపోయినా, యిప్పుడు వేరే ఒక వుద్యోగంలో వున్నాను. ఈ కొత్త వుద్యోగంలో ఎప్పటికప్పుడు నాకు వుత్సాహం కల్పించే అవకాశం వుంది దీనిలోనూ బాధ్యతలూ, చిక్కులూ, చికాకులూ లేకపోలేదు. ఆ మాటకొస్తే ఆమాత్రం బాధించేవి ఏ వుద్యోగంలో వుండవు? ఎట్లాచ్చీ చేసే వుద్యోగం మనకి యిష్టమైనదైతే, వచ్చిన చిక్కులను ఓపికగా విప్పుతూ, బాధ్యతలను బరువు అనుకోకుండా మోస్తూ గడిపేస్తాం. అంతే!

"నేనీ ఉద్యోగం 'కళ్యాణ మహోత్సవం దాకానే' అనే దృష్టితో చెయ్యడంలేదు. నాకు నేను ఒక '*Career*' ని సృష్టించుకొందామనే ఆశ. నా వ్యక్తిత్వాన్ని వికసింపచేసే ఒక *Career* ని నిర్మించుకొందామనే ప్రయత్నం - యీ వుద్యోగం. 'ఫలానావారి తాలూకు మనిషి'గా కాక, నేను నేనుగా ఒక ప్రత్యేకత సాధించాలని నా సంకల్పం. ఈ సంకల్పం తప్పక నెరవేరుతుందనే నా నమ్మకం. ఆ ఆశయ సిద్ధికోసం నా మార్గాన్ని సుగమం చేసుకోవటం కోసం అనుక్షణమూ పాటుపడుతూ వుంటాను.

"స్త్రీలు - వుద్యోగాలే కాదు-స్త్రీలకు, సంబంధించిన ప్రతి సమస్యలోనూ యిదమిద్ధమని ఒక అభిప్రాయాన్ని (అది పూర్తిగా వ్యక్తిగతాభిప్రాయమే కానీయండి)—తేల్చి, ఆ సమస్యా పరిష్కారానికి తాము ఏవిధంగా సహకారం చేస్తారో 'వనితాలోకం' శీర్షికలో వెల్లడిచేస్తే బాగుంటుంది. అప్పుడు మీ అభిప్రాయాలతో, ఆ సమస్యల పరిష్కారానికి మీరు సూచించే మార్గాలతో ఏకీభవించటం, ఏకీభవించకపోవటం, పాఠకులు ఎవరికివారు నిర్ణయించుకొంటారు. 'వనితాలోకం' స్త్రీల అనేక సమస్యలని యీవిధంగా చర్చించి, విమర్శించి, తన్మూలంగా స్త్రీ జనాభ్యుదయానికి దీపకళిక కాగలదని నా విశ్వాసం."★

శ్రీమతి "చిత్రలేఖ" గారు స్త్రీలు వుద్యోగం చెయ్యాలో, చెయ్యవచ్చునో నేను విశదంగా చెప్పలేదన్నారు. అసలు స్త్రీలు వుద్యోగాలు చెయ్యాలా అనే ప్రశ్న లేదు. వారు వుద్యోగాలు తప్పకుండా చెయ్యాలి; వాటికి తగిన అవకాశాలు కల్పించే బాధ్యత ప్రభుత్వంమీద ఎంతయినా వుంది. స్త్రీలు పురుషులు సమానంగా వుద్యోగాలు చెయ్యటానికి ఎదురయ్యే చిక్కులని తొలగించటానికి ప్రయత్నించే బాధ్యత ఒక్క స్త్రీలమీదే లేదు వారి చుట్టూవున్న పరిస్థితులూ, వాతావరణం అనుకూలించాలి.

స్త్రీలు ఉద్యోగాలు చెయ్యవలసిన అవసరం ఏమిటో మధ్యతరగతి కుటుంబీకులు యింకా అర్థంచేసుకోలేకుండా వున్నారు. కేవలం భర్తకి చేయూతగా వుండి ఆర్థిక సహాయం చెయ్యటమే గాకుండా ఉద్యోగాలు చెయ్యటంవల్ల స్త్రీలకి కొంతవరకూ మానసిక వికాసమూ, అనుభవమూ కలుగుతాయని నా వుద్దేశం. ఇంతే గాక జీవితంలో ఎప్పుడయినా క్లిష్ట పరిస్థితులు ఎదుర్కొనే అవసరం ఏర్పడితే, తమకాళ్ల మీద తామునిలబడగలిగే స్త్రీలు జీవితాన్ని ధైర్యవిశ్వాసాలతో గడపగలరనుకోవచ్చు. భర్త తీవ్రమయిన రోగానికి గురిఅయిన పక్షంలోనూ బాల్యంలోనే భర్తలను పోగొట్టుకున్న స్త్రీలకి స్వతంత్రంగా జీవనోపాధి కల్పించుకోవలసిన అవసరం తరుచూ ఏర్పడుతూంటుంది. ఇలాటి సమయాలలో స్త్రీలకి స్వతంత్రంగా సంపాదించుకుని జీవించే అవకాశం కలుగజేస్తే సంఘంలో వారి పరిస్థితి మారి కొంత అనుకూలమైన ఫలితాలు కలగవచ్చునని చెప్పవచ్చును.

ఆర్థికంగా స్త్రీలకి స్వాతంత్ర్యం పొందాలనే అభిలాష లేకపోయినా, ఉద్యోగాలుచేసి ధనార్జనచేసే స్త్రీలకి డబ్బు విలువ మరింతబాగా బోధపడుతుందనటం అంత అన్యాయం కాదనుకుంటాను. నెలపొడుగునా ఆఫీసులోపడి ఉద్యోగంచేసి ధనార్జనచేసే పురుషుల యిబ్బందులనీ, వారి కష్టాలనీ, స్వయంగా ఉద్యోగాలుచేసి

> అల్పమైన కొవ్వొత్తి కాంతి కిరణం ఎంత తక్కువదూరం ప్రసరిస్తుందో, గందరగోళంతో నిండిపోయిన యీ ప్రపంచంలో జరిగే ప్రతి చిన్న మంచిపనీ అంతేతక్కువదూరం ప్రయాణిస్తుంది.
>
> —విలియం షేక్.

# ★ స్త్రీలు ఉద్యోగాలు ★

కొంత జీవితానుభవం గడించే స్త్రీలు సులభంగా అర్థంచేసుకునే అవకాశం వుంది. కేవలం ధనం ఎలా వ్యయం చెయ్యాలి అనే సమస్యనేగాక, ధనం ఎలా సంపాయించాలి, ఎలా సద్వినియోగం చేయాలి అనే సమస్యని గురించి స్త్రీలు కొంతవరకూ ఆలోచించటం మొదలు పెడతారు.

ఆర్థిక చిక్కులే గాకుండా, వుద్యోగాలు చెయ్యడంవల్ల స్త్రీలు పొందే లాభాలు అనేక రకాలయినవి. నాలుగుగోడలమధ్యా జీవితమంతా వెళ్ళబుచ్చుతూ, అదే ప్రపంచం అని వూహించుకోకుండా, వివాహానికి పూర్వమో, వివాహానంతరమో స్త్రీలు నలుగురిమధ్యా అడుగు పెడితే ప్రపంచానికి సంబంధించిన అనేక విషయాలని తెలుసుకోవచ్చు. వారి అభిప్రాయాలనీ అభిరుచులనీ అనేక విధాలుగా పెంపొందించుకోవచ్చు. భవిష్యత్తులో వారికి ఈ అనుభవాలన్నీ ఎంతో తోడ్పడతాయి.

స్త్రీలు ఉద్యోగాలు చెయ్యవలసిన అవసరం, అవకాశాలు ఎన్నో వున్నాయి. కానీ వాటికి అనుకూలించే పరిస్థితులు మన దేశంలో యింకా ఏర్పడలేదు. ఆ అవకాశాలు కల్పించుకోడానికి స్త్రీలు, పురుషులూ కూడా ఎంతో కృషిచేయవలసి వుంది. వివాహానంతరం సంతానం కలిగే సమయానికి ఉద్యోగం విరమించుకోవలసిన అవసరం స్త్రీలకి తప్పకుండా ఏర్పడుతుంది. ఒకవేళ పిల్లలని ఆయాలకి వదిలి వెళ్ళినా వారికి సక్రమమైన శిక్షణ ఆయాల సంరక్షణలో దొరుకుతుందనుకోవటం పొరపాటు. పాశ్చాత్య దేశాలలో లాగా పిల్లల తల్లులు ఉద్యోగాలు చెయ్యటానికి కావలసిన అవకాశాలు కల్పించే బాధ్యత మన ప్రభుత్వంమీద ఇతర సంస్థలమీద వుంది.

స్త్రీలు తాము వుద్యోగాలు చెయ్యగలమా లేమా అని సందేహించే ముందు, వుద్యోగాలు చెయ్యడంవల్ల వారికి కలిగే లాభాలని సరిగా అవగాహన చేసుకోవటం మంచిది. సాంఘిక జీవితంపట్ల, రోజు రోజుకీ అభివృద్ధి పొందుతున్న ఆధునిక విజ్ఞానం పట్ల స్త్రీలు వారి అభిప్రాయాలు మార్చుకుని ముందంజ వేస్తేగాని, తమ యిబ్బందులని తొలగించటానికి పూనుకోకపోవటం అవివేకం.

శ్రీమతి చిత్రలేఖగారు వుద్యోగంలో వున్న స్త్రీలు, నిరుద్యోగులని వివాహమాడి వారికి కొంత సంతృప్తిని స్త్రీ తిప్పాలేదన్నారు. వారి అభిప్రాయం బాగానే వుంది కానీ చదువుకుని ఉద్యోగాలు చేసే స్త్రీలు వివాహసమయంలో నిరుద్యోగిఅయిన పురుషుణ్ణి చేపట్టటమనేది అసంభవం. ఒకవేళ ప్రేమపిచ్చిలో పడిగానీ, విశాలభావాలు అలవరచుకుని గానీ ఆ స్త్రీ సిద్ధపడి వచ్చినా, మరి పురుషుడి మాట ఏమంటారు? ఈ రోజుల్లో చదువుకున్న స్త్రీలని జూచి మైలుదూరం పరుగెడుతున్న పురుషుడు తాను కటిక దరిద్రుడయినా, ఆత్మగౌరవం చంపుకుని వుద్యోగంలో వున్న స్త్రీని వివాహమాడతాడా? అంతెందుకు— డబుల్ డిగ్రీవున్న ఏ అమ్మాయిగాని తన కంటె కొంచెం తక్కువ చదువుకున్న వాణ్ణి వివాహం చేసుకోటానికి సిగ్గుపడుతుంది. అటువంటిది చదువు పూర్తయి ఉద్యోగం చేస్తూ, ఆర్థిక చిక్కులని బాగా అవగాహన చేసుకున్న స్త్రీ నిరుద్యోగంలో వున్న పురుషుణ్ణి, అందులో నిరుద్యోగ సమస్య తీవ్రంగా వున్న ఈ రోజుల్లో ధైర్యంచేసి పెళ్ళాడుతారంటే నేను వప్పుకోను. భార్యాభర్తలిద్దరూ అన్యోన్యంగా వుంటే చాలు నన్నారు. ఆ అన్యోన్యత భార్య వుద్యోగస్థురాలయి భర్త నిరుద్యోగుడయితే అంత సులభంగా సమకూరదేమో! అయితే కొన్ని అసాధారణ కుటుంబాలలో అలా జరుగుతాయని ఒప్పుకోవాలి లెండి.

ఇదిగాక అలంకారంకోసరం చదువు [illegible] చదువుకునే స్త్రీలు వుద్యోగాలు చేసే స్త్రీలని అవహేళన చేస్తున్నారంటారు. నేను ఏకీభవించలేను. పురుషుల మాట ఏమయినా, చదువుకున్న స్త్రీలు, నాకు తెలిసినంతమటుకు, చదువుకుని వుద్యోగాలు చేసే స్త్రీలని ఎక్కువ సానుభూతితో చూస్తారనుకుంటాను. వారు చెప్పినట్లు అవహేళన చేసే స్త్రీలు అటు చదువు పూర్తిగా రాకుండా, యిటు పూర్తిగా చదువులేకుండా మిడిమిడి జ్ఞానం గలవారే నని నా అనుమానం. వారి హేళన లంత పాటించవలసిన అవసరం లేదు.

[illegible] స్త్రీలకి ప్రత్యేకమైన ఉద్యోగాలు లేవన్నారు. నేటి పరిస్థితులలో [illegible], టైపురుపనీ, నర్సింగు కోర్సు మొదలైనవి బాగా అనుకూలంగా ఉన్నాయి. ఇవిగాక కుట్లు, అల్లిక, అద్దకము మొదలైనవాటిలో మన ప్రభుత్వం ప్రత్యేకంగా పరీక్షలు పెట్టి, డిప్లొమాలు ఇస్తుంది. ఈ డిప్లొమాలను పొందినవారు వృత్తి ఉద్యోగాలు సంపాయించుకోగలిగే సదుపాయాలున్నాయి. హిందీ పరీక్షకి చదివి టీచరుపని చేసే స్త్రీలు చాలామంది వున్నారు. ఇక నర్సింగుకోర్సులలో మేల్ నర్సులు వస్తారంటున్నారా? ఏం చేస్తాం! నిరుద్యోగ సమస్య తీవ్రంగా వున్న ఈ రోజుల్లో పురుషులవృత్తుల్లో మనం ఎలా కలియబడుతున్నామో అలాగే వారూ మనతో పోటీపడుతున్నా రనుకుందాం.

మీరు వుద్యోగాన్ని కల్యాణమహోత్సవం దాకా గాకుండా, ఒక కెరియర్ కింద తీసుకున్నందుకు చాలా సంతోషం. ఉద్యోగం చేస్తూ మీరు ఎదుర్కొన్న యిబ్బందులను గురించి యింకా యింకా వనితాలోకానికి మీ అనుభవాలనీ, అభిప్రాయాలనీ పంపుతారని ఆశిస్తున్నాను.

"ఓమ పురుషుడు"గారు ఇలా వ్రాస్తున్నారు:

"క్రితం వారం ఆంధ్రపత్రిక - సచిత్ర వారపత్రికలో 'వనితాలోకం' శీర్షికలో స్త్రీలు - వుద్యోగాలు అనే వ్యాసాంతంలో 'స్వయంగా వుద్యోగాలు చేస్తున్న, చేసిన స్త్రీలు వారి అనుభవాలను వ్రాసి పంపితే ప్రచురిస్తా'మన్నారు. నేను స్త్రీని కాకపోయినా, వుద్యోగం చేస్తున్న ఒకొక్క

---

చేసిన పొరపాట్లనే జీవితానుభవాలుగా చలామణీ చెయ్యాలని సామాన్యంగా ప్రతివారూ ప్రయత్నిస్తుంటారు.

—ఆస్కార్ వైల్డ్.

*   *   *

చచ్చిపోయేంతవరకూ మనిని గురించి తెలుసుకోనేవాడు ఒక్కడైనా లేకపోతే చచ్చుమన్నమాట!

—విక్టర్ హ్యూగో.

---

## వనితాలోకానికి ఒక ప్రశ్న!

—స్త్రీ ఎంత చదువుకొన్నదైనా ఫౌంటెన్ పెన్‌తో రాసేటప్పుడు క్యాప్ (Cap) తీసి కింద పెట్టుతుందేమి?

—ఈ ప్రశ్నకి పాఠకు లెవరైనా సమాధాన మివ్వగలరా?

> ఆడవాళ్ళు తెలివి తక్కువ మనుషులు కారని నేనటం లేదు: కాని మొగవాళ్ళకి తగినట్లు వుండటంకోసమే భగవంతుడు వాళ్ళను అలా సృష్టించాడు!
>
> —జార్జి ఇలియెట్.

నొక వనితకు భర్తని అయి వున్న కారణం చేత, వుద్యోగంలో వున్న స్త్రీల భర్తల తరఫున కొంత చెప్పవలసి వుంది కాబట్టి యీ లేఖ వ్రాస్తున్నాను వీలైతే ప్రచురించండి.

"ఉద్యోగం అనేది మధ్యతరగతి స్త్రీలకు మాత్రమే సమస్య అన్నారు కాబట్టి, మాది నికార్సైన మధ్యతరగతి కుటుంబమేనని ముందుగా చెప్పుకోవాలి. అందులోనూ వుద్యోగాలమీద మాత్రమే ఆధారపడే కుటుంబంకూడా అవును ఎందుచేతనంటే— మాతాత ఏం చేసేవారో నాకు తెలియదు కాని, మానాన్న జీవితకాలం వుద్యోగాలలోనే గడించిది అల్లాగే మా ఆవిడ తాతగారి సంగతి నాకు సరిగా తెలీదుకాని, వాళ్ళ నాన్నగారు—అంటే సాక్షాత్తు మా మామగారు—మరీ బడిపంతులు వుద్యోగంలోనే మగ్గిపోయారు. అందుచేత మాకూ జీవయాత్ర చేయటానికి వుద్యోగం వినా అన్యథా శరణం నాస్తి.

"ఇదంతా యిక్కడ ఏకరువు పెట్టటం ఎందుకంటే - మీ వ్యాసంలో ఏ అర్హతలు గల వ్యక్తులకైతే యీ సమస్యపై అభిప్రాయాలు వ్రాసేందుకు హక్కు వున్నదన్నట్లుగా మీరు చిత్రించారో, అదృష్టవశాత్తు సరిగ్గా అటువంటి వ్యక్తులలో నేనూ ఒకణ్ణి అని చెప్పుకోవటానికి మాత్రమే.

"ఇక పోగా - నేను చెప్పుకోదలచింది ఏమిటంటే - 'సంసారంలో వడిదుడుకులూ మనస్పర్ధలూ రాకుండా, పిల్లలవిషయంలో అజాగ్రత్త వహించకుండా, ఆరోగ్యం చెడకుండా, తమ ప్రవర్తనలో మార్పు రాకుండా' స్త్రీలుకూడా వుద్యోగాలు చెయ్యటాని కవకాశం వుందేమో పాఠకలోకాన్ని వూహించమన్నారు. అనటం బాగానే వుంది ఇన్ని 'కుండా'లు ఒక్కచోట చేర్చడం అసంభవమునేది, కాస్త కళ్ళు తెరిచి జీవిస్తున్నవారి కెవరికైనా అవలీలగా బోధపడుతుంది

"మా యిద్దరి జీవితాలనే ఆధారంగా తీసుకొని వీటిలో ఏవేవి ఎంతవరకు కుదిరాయో, ఎంతవరకు కుదరలేదో ముంగు చెప్తాను

"(1) సంసారంలో వడిదుడుకులూ, మనస్పర్ధలూ—సంసారం అన్న తరువాత యివి వాడికే పోతే ఆడది వుద్యోగం చేస్తున్నందువల్ల యివి అధికంగా వస్తాయనేది అబద్ధం ఇద్దరు మనుషుల మధ్య వడిదుడుకులూ, మనస్పర్ధలూ రావటానికి బయటినుంచి వచ్చిన ప్రోద్బలాలకంటే, వారిద్దరిలోనే వ్యక్తిగతంగా వున్న కొన్ని అపోహాలు ఎక్కువగా కారణాలు అవుతుంటాయి. పైకి కనుపించే కారణాలు నిమిత్తమాత్రాలు నిమిత్తమాత్రంగా ఏ కారణం దొరికినా మనస్పర్ధలు రేగే యిద్దరు మనుష్యులమధ్య వుద్యోగం వున్నా లేకపోయినా, అవి కోకొల్లలుగా వస్తాయి. అదే నిజమైనప్పుడు ఆ దోషం వుద్యోగాలకి మాత్రమే అంటగట్టటం అన్యాయం.

"మా సంసారంలో అనేక వడిదుడుకులు వచ్చాయి. వాటికి కారణం పూర్తిగా ఉద్యోగం మాత్రం ఏనాడూ కాలేదు. తాత్కాలికంగా ఒకప్పుడు మా యిద్దరిలో ఏ ఒక్కరు అలా అనుకొన్నా, అది అప్పుడు అలుముకున్న చీదర మూలంగా వచ్చిన భావన మాత్రమేనని ఆ మరుక్షణమే మాకు మాకే బోధపడింది

"(2) పిల్లల విషయంలో అజాగ్రత్త వహించకుండా—

"మాకు యింతవరకు పిల్లలు లేరు కాబట్టి, పుట్టని మా పిల్లలు బతికిపోయా రనిపిస్తోంది- నా ప్రాణానికి. దీని విషయంలో సాధక బాధకాలు చర్చించే అర్హత నాకు ప్రస్తుతానికి లేదు కాబట్టి దాన్ని వదిలేస్తున్నాను

"(3) ఆరోగ్యం చెడకుండా—

"ఎందుకు చెడదండీ ఆరోగ్యం?—ఆయాలనీ, వంటమనుషులనీ పెట్టుకొనేపాటి శక్తి స్తోమతులు యిచ్చే ఆర్జనలు కావు మా యిద్దరివీ కలిసికూడా. అలాంటప్పుడు విధిగా మా ఆవిడే పొద్దున వంటా, పగలు ఆఫీసు, సాయంకాలం మళ్ళా వంటా యిలా ఎదులా అహర్నిశలూ పనిచేస్తూనే గడుపుతోంది.

"ఇది చాలదన్నట్లు వచ్చేపోయే బంధువులు; అర్ధరాత్రిదాకా బాతాఖానీకోసం వచ్చే మిత్రసత్తములు. పాత పద్ధతుల్లో బంధుమర్యాదలకీ లోపం రాకూడదు సరికొత్తపద్ధతులలో యిష్టాగోష్ఠి అకుంఠితంగా సాగిపోవాలి ఈ రెంటికీ పొంతన కుదురుతోందనే భ్రమలో ఎంతకాలం గడపగలం? అసలే ఆడది అర్భకురాలు. అందులోనూ కాలేజీ చదువులు చదివిన యీ చకోరాలు కేవలం వన్నెలవంటి అతిసున్నితమైన వస్తువులనే కాని, అతి అల్పంగానైనా ఆరగించరాయెను. ఇక వీరికి యిన్ని బరువు బాధ్యతలు మోసే శక్తి రమ్మంటే ఎలా వస్తుంది? పుష్టికరమైన ఆహారానికి దూరమైన ఫలితంగా ఆర్జనలో అధమపక్షం మూడోవంతైనా బుసిమంతులైన డాకరకి, ముచ్చ కొత్త పేటెంట్ మందులకి ముడుపు కట్టాల్సి వస్తోంది ఈ విషయం తలుచుకొన్నప్పుడల్లా - ఆడవాళ్ళని వుద్యోగాల్లో ప్రవేశపెట్టటంవల్ల ఆమెకి గాని, ఆమె కుటుంబంలోనివారికి గాని ఎటువంటి మేలూ చేకూరకపోగా, బస్తీలోని పెద్ద డాక్టరకీ, విదేశాల్లోని మందుల ఫ్యాక్టరీలకి మాత్రమే లాభదాయకమౌతున్నదేమో ననిపిస్తోంది.

"(4) తమ ప్రవర్తనలో లోపం రాకుండా -

ఈ అంశానికి సమాధానం రాయటం చాలా కష్టం ముందుగా ప్రవర్తన అంటే ఏమిటో, అందులో ఏది లోపమో ఏది కాదో నిర్ణయించాలి. వుద్యోగం చేసే స్త్రీ ప్రవర్తన విషయంలో లోపం అని మీరు అన్నప్పుడు, మీరు ఏది మనసులో పెట్టుకురాశారో వూహించటం కష్టంగా వుంది. బహుశః ఒకటై వుంటుంది - ఆ వ్యక్తితో ఏ విధంగానూ సంబంధం లేనివారికి సహితం లోపంగా అనిపించేమాదిరి ప్రవర్తన ఐవుండవచ్చు. అటువంటి లోపాలు రావటానికికూడా కారణభూతమైనది ఆ వ్యక్తి మానసిక ప్రవృత్తే కాని మరొకటి కాదు. ప్రతి వ్యక్తిలోనూ అణిగి మణిగి వుండే వుద్రేకాలు, నిద్రాణంగా వుండే శక్తులూ అన్నీకూడా పరిసర ప్రభావాలవల్ల పైకి పొంగుతాయి ఆ వుద్రేకాలు కానీ, యీ శక్తులు కానీ పూర్తిగా పరిసరాల ప్రభావంవల్ల సరికొత్తగా పుట్టుకురావు. అదివరకు వున్నవే పైకి వస్తాయి. అలాంటప్పుడు పరిసరాలను తిట్టటం దేనికి?

అంత పెద్దలోపాలు కావంటారా? - వాటి విషయం వేరు భార్యాభర్తలైనవారు ఒకరి వ్యక్తిత్వాన్ని ఒకరు మన్నించలేనంతకాలం ఆ మాదిరి చిన్నవీ పెద్దవీ అనేక లోపాలు రాకమానవు అలా వచ్చిన వాటిని ఎప్పటికప్పుడు సర్దుకుంటూ, ఒకరి విషయంలో ఒకరుపట్టు విడుపు సూత్రాలు పాటించుకొంటూ జీవితంలో ముందుకి సాగిపోవాలి అలాటి లోపాలు వస్తూ

> పీడకల వచ్చి వులిక్కిపడి లేచిన పెళ్ళాం మొగుడితో: "ఏమండీ! నేను చచ్చిపోయినట్లు కల వచ్చిందండీ... నేను చచ్చిపోతే మీరు మళ్ళీ పెళ్ళి చేసుకొంటారా?"
>
> మొగుడు: "ఇంత అర్ధరాత్రప్పుడు ఏంచేసుకొంటాను నా మొహం!...పడుకో!"

# ★ స్త్రీలు ఉద్యోగాలు ★

వుండటమూ, ఆ వచ్చినవాటిని సరిచేసుకోవటంలోనే కదండీ జీవితంలో శోభవుండేది!

"ఈమాదిరి 'లోపాలు' ఎన్నో మా జీవితాల్లో వచ్చాయి; వస్తున్నాయి; వస్తాయి అయితేనేం - అవి వచ్చినప్పుడల్లా చిందులు తొక్కే తత్వం మాత్రం నానాటికీ మా యిద్దరిలోనూ దానంతటదే తగ్గుతోందని ఒంటరి వేళల్లో నేను అప్పుడప్పుడూ మురిసిపోతుంటాను.

"అమ్మా!—యింతకీ నేను చెప్పవచ్చేదేమంటే, స్త్రీలు వేరుగాను వుద్యోగాలు వేరుగాను పెట్టుకొని ఆలోచించేవారికి అన్నీ సమస్యలే అయినట్లు అనిపిస్తుంది కాని, స్త్రీ అనేది వెలుగునీడల కలయిక అనీ, వుద్యోగం అనేది ఆమె జీవితకాలంలో చేసే అనేక పనుల్లో అదీ ఒకటి అనీ అవగాహన చేసుకొన్నవాళ్ళకి అవి అంత ప్రధానమైన విషయాలు కావు. వేసవికాలపు వానజల్లుల్లాగా ఏవో కొన్ని చిట్టిపొట్టి క్లేశాలు అలాంటివాళ్లకి వస్తాయి; పోతాయి! కాని వాటివల్ల వీళ్ళ అంతరాత్మలు మాత్రం ఏవిధంగానూ కలుషితం కాలేవు!" ★

స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటంవల్ల కొత్త వడిదుడుకులూ మనస్పర్థలూ రావనీ, అవివారిద్దరిలోనూ వ్యక్తిగతంగావుంటాయనీ 'కిమ్‌పురుషుడు' గారు అన్నారు. ఉద్యోగంవల్ల అన్యోన్యంగావుండే యిద్దరు వ్యక్తులు హటాత్తుగాజుట్లూజుట్లూపట్టుకోవటం ఎప్పుడూ సంభవించదు. ఆడది వుద్యోగంచేస్తోంది కదా అని భర్త ఆమెని ఓకంట జాగ్రత్తగా కనిపెడుతూనే వుంటాడు. అంతకుముందు ఆమె ఎన్ని ఎదురుజవాబులు చెప్పినా ఓర్పు వహించేవాడు, ఆర్థిక స్వాతంత్ర్యం వల్ల ఆమె అలా పలుకుతోందని అనుమానిస్తాడు. ఇంకా ఇలాటి అనుమానాలూ, మనస్పర్థలూ తప్పకుండా కలుగుతాయి. కానీ మీరుమటుకు యిటువంటి చిక్కులు ఇంతవరకూ ఎదురోక్కనందుకు సంతోషం.

ఈ ప్రపంచంలో పురుషులంతా మీలా విశాలభావాలు కలిగివుంటే స్త్రీల సమస్యలు ఎప్పుడో అంతరించిపోయే వనుకుంటా.

పిల్లల విషయంలో మీకింకా యిబ్బందులు కలగ లేదన్నారు. ఈ సమస్యని చాలా తెలివిగా పరిష్కరించుకునే మార్గం మీరేదో కనిపెట్టారనుకుంటా.

మీ భార్య 'అసలే ఆడది, అందులోనూ అర్భకురాలు' అన్నారు. స్త్రీలకి శారీరకమైన శక్తి లేకపోతే ఉద్యోగాలు చేయించటం తప్పే ఆడవాళ్లని ఉద్యోగాలకి పంపించటంవల్ల ఆమె కుటుంబానికి ఎటువంటి మేలూ జరగదంటే నేనొప్పుకోను. ఆమె అనారోగ్యానికి కేవలం ఉద్యోగం చెయ్యడమే కారణమని ఎలా చెప్పగలరు? అదీగాక ఉద్యోగాలు చేసేటంత బలం ఆడవాళ్లకి లోపిస్తుందనటం అంత న్యాయంగా కనుపించదు. శారీరక శక్తిలేని పురుషులు ఎంతమంది వుద్యోగాలు చెయ్యటం లేదు?

ప్రవర్తన అంటే—ఒక్కసారిగా నాలుగు గోడల మధ్యావుండే స్త్రీ, వుద్యోగం చెయ్యటానికిగాను బయటప్రపంచంలో అడుగుపెడితే ఆమెకి ఎదురయే యిబ్బందులూ, అనుభవాలూ ఎన్నో విధాలుగా వుంటాయి. ఆమె మనస్సుని మార్చివేసి, సంసారంపట్ల ఆమె బాధ్యతలూ, అడ్డుపడే అన్ని పరిస్థితులనీ తెలివిగా ఎదుర్కొని నలుగురిలో మంచిపేరు సంపాయించుకోవలసిన భారం ఆమెమీదే వుంది. ★

(వనితాలోకం)




ఏ. యస్. కళ్యాణి

అసలా మనిషి తరహాయే అంత అనుకుంటుంది సావిత్రి. కాకపోతే మరేవిటి? ఏరు దాటేక తెప్పను తగలబెట్టేరకం వాడాయె! అసలతని తీరే అంత. అందుకనే గ్లాసుడు కాఫీ చుక్క మిగల్చకుండా తాగేసింది, మళ్ళీ మాట్లాడకుండా! అతను కాస్త కోప్పడ్డాడే అనుకోండి. అంతమాత్రానికి ఇంకో సారైనా అడక్కుండా ఆమె ఈ పని చేయడం ధర్మమా, భార్య లక్షణమేనా, అని ఎవరైనా అడగొచ్చు. సావిత్రేం తెలివి తక్కువది కాదు, అభాండం అంతా తన మీద వేసుకోటానికి. 'ఇన్ని సంవత్సరాల నుంచి కాపురం చేస్తున్నానాయె! ఇంత మాత్రం చెయ్యలేకపోతే ఈ మనిషితో పడేకన్న ఏ నుయ్యో గొయ్యో చూసుకుని వుందును!' అంటుంది ఖండితంగా.

అసలే చిన్నప్పట్నించీ కాస్త పెంకి ఘటం అని పేరు ఉండనే వుంది. భక్తి తప్పినా ఫలం దక్కితే చాలంటుంది సావిత్రి. సాయంత్రానికి పౌను కాఫీ పొడరూ ఎలాగూ ఇంటికి వస్తుంది. అంతే తనకు కావలసింది. ఓ రెండు మాటలు అతనంటేమాత్రం అదొక లెక్కలోది కాదు.

'ఎదురుగా బల్లమీద గ్లాసు. అందులో వేడిగా పొగలుగక్కే కాఫీ కళ్ళబడ్డంతోటే ఏదో రాసుకుంటున్నవాడల్లా తలెత్తి సివంపూనినవాడిలా అన్నాడు విశ్వనాథం: 'తాగనని చెప్పలా? వెధవ కాఫీ... కొంప గుల్లచేస్తోంది. తీసుకుపో యిక్కణ్ణుంచి!'

క్షణంసేపు సావిత్రి నిర్ఘాంతపోయింది. 'ఎందుకండీ! అంత నోరుచేసుకుంటారు? వద్దంటారని నేనేమన్నా కలగన్నానా?' అంది కాస్త నొచ్చుకుని.

'ఎందుకు కలగనాలి? నిన్న సాయంత్రం చెప్పలా? ఒకసారి చెప్తే మనిషికి బుద్ధుండాలి' తలవంచుకునే అన్నాడు విశ్వనాథం.

'బాగుందండీ! మీరు కాఫీ వద్దంటే మానెయ్యక, పోనీ తాగుతారేమోనని తీసుకురావడంకూడా బుద్ధి గడ్డినే. ఇదుగో మానెండి! ఇవాళ కాఫీ ఎంత బాగుందో చూడండి! మరి వదిలేస్తే వృథాగా...'

'కోపంగావున్న వాళ్ళని ఇలాటిమాటలంటే నిజంగా ఉడికించటమే. విశ్వనాథానికి అరికాలిమంట నెత్తికెక్కింది. 'ఇహ చాలించండి కాఫీ వర్ణన! రుచిమాసి తాగడానికి నేనేం నీలాగ కరువాచిపోలేదు! అదేదో నువ్వే తీరిగ్గా అనుభవించు ... వెళ్ళిక్కణ్ణుంచి' అన్నాడు.

'సరేలెండి బాబూ! ఇహచాలు. నేనే తాగుతాను హాయిగా!' వెనుదిరిగి వెళ్తూ కంటి కొసలలోనుంచి ఓమారు ఓరగా చూసింది సావిత్రి. చివర 'హాయిగా' అన్న మాటకి విశ్వనాథం తామసం నసాళానికంటిందనే చెప్పాలి. నిప్పులు చెరిగేస్తున్నాడు కళ్ళల్లోంచి. మరు నిమిషంలో నాలుగుగుక్కల్లో గ్లాసుడు కాఫీ పరమానందంగా ఖాళీచేసింది సావిత్రి. 'సిగ్గులేని ఘటం' అనుకున్నాడు విశ్వనాథం.

సావిత్రికొక ధీమావుంది. అప్పుడప్పుడు కాఫీమీద పేచీలువచ్చి మానెయ్యడం, మర్నాటినుంచీ తిరిగి యథాప్రకారంగా తాగుతూండడం విశ్వనాథానికి పరిపాటే. అందుకని సావిత్రి ఆ విషయం ఆట్టే పట్టించుకోకపోడం అలావుంచి, ఆ వేళ సంతోషంగా రెండు గ్లాసులూ తనే పట్టించేసింది! పైగా కోపంవస్తే మానేయడం ఉత్తమం అని కూడా అనింది!

అసలు వాళ్ళిద్దరిమధ్యా తరుచు కాఫీ విషయంలో తగాదాలు, మాటవిరుపులు, ముక్కు విరుపులు, ఎడపెడముఖాలూ కలుగుతూండడం అలవాటు. మళ్లీ యిద్దరూ ప్రతీ ఉదయం తప్పక 'టంచను'గా కాఫీ స్వీకరించేవాళ్ళే. కాని చిత్రమేమిటంటే విశ్వనాథంలో – అది దుర్గుణం అనాలో, సద్గుణం అనాలో ఆ పరమాత్ముడికే తెలుసు – ఒకగుణం వుంది. ప్రతీ ఉదయం తాను కాఫీ తాగుతున్నాడంటే అది భార్య ఏడ్చిపోతుందనే కాని, తను మనఃపూర్వకంగా తాగడం కాదని బల్లగుద్ది చెప్తాడు విశ్వనాథం! 'వెధవ కాఫీ! మంచినీళ్ళపాటి చెయ్యదు!...' అంటాడు. సావిత్రి కది నచ్చదు. కాఫీవిలువ ఆవిడకి బాగా తెలుసు. తన దృష్టిలో అంత విలువైన వస్తువును అతడంత హీనంగా చూడటం ఆవిడ సహించలేదు. ఈవిడని ఉడికించటానికో, లేకపోతే తనకున్న కసికొద్దీనో అదేమాట పదేపదే అంటాడు విశ్వనాథం.

తాను పురుషుడు కాబట్టి ఎప్పుడూ ఓ మెట్టు పైనుండాలన్న సంగతి అతడెప్పుడూ, ఆఖరికి కలలోకూడా మరిచిపోడు. అందుకనే సావిత్రి 'ఏరుదాటేక తెప్పగాల్చేరకం' అనడం. లేకపోతే రెండు పొద్దులూ – ఇంకా తను తెచ్చియిస్తే మరోసారి కూడా – కాఫీ తాగుతూనే అది ఏదో అనవసరమైన వస్తువులా కట్టడం ఏమంత బాగు? పోనీ అంత విలువలేని కాఫీని తాను త్రాగడం మానేశాడా? అదీలేదు. అంతకాడికి యిన్ని శాపనార్థాలు పెట్టడం దేనికి? అంటుంది సావిత్రి. 'నేను మానెయ్యకపోడానికి కారణం నువ్వే' అంటాడు విశ్వనాథం. అవును. తనొక్కత్తే తాగితే బాగుండదని తనకి అదోలా తోచి భర్తకి యిస్తూవుండడం నిజం. 'నేనిస్తే మీరు తాగాలని లేదుగా!' అంటుంది సావిత్రి.

కాఫీపౌడరు తెమ్మన్నప్పుడో, లేక ఇంటి జమా ఖర్చులు వేస్తున్నప్పుడో కాఫీ కయ్యే ఖర్చు చూస్తే విశ్వనాథంమనస్సు చుమచుమమంటుంది. అటువంటప్పుడల్లా భార్యమీద బుసబుసలాడ్డం రివాజు. "వెధవ కాఫీ...ఎందుకూ పనికిరాని తాగుడుకు యింత ఖర్చా? – ఇక సంసారాల్ని మూటగట్టి ఏట్లో విసిరి సన్యాసం పుచ్చుకోవచ్చు ముందు నెలనుంచి నువ్వు కాఫీకి స్వస్తి చెప్పాల్సిందే. నే నసలు పౌడరే తీసుకురాను."

అలా అన్నప్పుడల్లా సావిత్రి నవ్వుకొం ●

టుంది— పైకి కాదు సుమండీ! మధ్య మధ్య విసుస్తుంది కూడా.. ఎన్నిసార్లు తనల్లా అన్నాడో అలా ఎన్ని నెలలు గడిచిపోయాయో విశ్వనాథానికి గుర్తుండదు.

'ఇదొక అలవాటా? దర్జాగా మానెయ్యొచ్చు' అంటాడు. కాబట్టి ఎన్ని వాగ్వాదాలు వచ్చినా తను మానెయ్యాల్సిందే కాని, ఎన్ని తిట్లు తిన్నా, ఎన్ని కన్నీళ్లు కార్చినా సావిత్రిమాత్రం 'ఆ పిచ్చి పని' ఎప్పుడూ చెయ్యదు. తీరిగ్గా తాగి మరీ విడుస్తుంది అంతగా అయితే... ఈ విషయంలో మాత్రం సావిత్రి సహనం ఎంతైనా అభినందించదగిందే

'కాఫీ తాగడంమాత్రం తప్పదు ఎన్ని పేచీలు పెట్టుకున్నా!'.. సావిత్రి ఆమాట అంతక్రితంరోజు సాయంకాలం అనడం అక్షరాలా నిజం. మరి పేచీ అక్కడే వచ్చింది! 'ఇంతమాట నువ్వు అనగూడనిది తాగనే అనుకో అది నీకోసంగాని నాకోసం కాదు పైగా నన్ను దెప్పిపొడుస్తావా?.. ఊరుకుంటూంటే మరీ రెచ్చిపోతోంది పొగరు!...' అన్నాడు విశ్వం. కోపం వస్తుందేమో అని సందేహించినా అనకుండా ఉండలేకపోయింది సావిత్రి

'అంటే తప్పేమిటండీ? ఉన్నమాటంటే'— నాలుక కొరుక్కుంది సావిత్రి.

'ఆ పైమాట కూడా అను. ఉన్నమాటంటే ఉలుకెక్కువని! తాగడం మానలేని ముఖానివి నీలో నువ్వే పడక పైగా నన్నంటావా? నన్ననడానికి నువ్వెవరు? నేను సంపాదించేవాణ్ణి! నన్నే అధికారం లేదు నీకు—'

పాపం! సావిత్రికి అభిమానం వచ్చింది. అయినా తనకు కాఫీ అవసరం అన్నమాట నిజమే. కాని యింతలోకే అధికారాలూ, అనధికారాలూ తెలిక్కిపోడం దేనికి?... తనేదో మాటవరసకి అంది ఆ మాట! బాగుంది! తను మాటవరసకంటే అతనికి కూడా అల్లా అనిపించాలని తననుకోడం పొరబాటు. అతని కది, పైగా ఒక ఆడదాని చేత అంతమాట, అంగుంగోనూ అంత వ్యంగ్యంగా, అనిపించుకోటం శిరస్సు కొట్టేసినట్టు కాదూ?!! ..విధి ఏమైతేనేం అతను ఆనాటినుంచీ కాఫీ ముట్టుకోకూడదని శపథం చేసుకున్నాడు

విశ్వనాథం కాఫీ తగి రెండురోజులయింది సావిత్రిక మనస్సులో కష్టం లేదనడం పొరబాటు, కాని కాఫీ తాగడం మాత్రం మానలేదు ఈసారి విశ్వనాథం బాగా పట్టుదలమీదే ఉన్నాడనుకుంది సావిత్రి మధ్యలో తీసు కెళ్ళి యివ్వాలనుకున్నా తిడతాడనే భయంతో వెనుకంజ వేసింది

మూడోనాడు సాయంత్రం విశ్వనాథం ఆఫీసునుంచి ఇంటికి వచ్చాక తిరిగి బైటికి

'ఏమండీ! అలా వున్నారు?' అంది దగ్గరగా వచ్చి

'ఎలావున్నాను? బాగానే వున్నాను' అన్నాడు ముక్తసరిగా, మాట్లాడడం యిష్టంలేనట్టు.

'మీ రలా అంటేమాత్రం చూసేవాళ్లకి తెలియదేమిటీ?...తలనొప్పిగా వుందా?'...

'ఏదో కొద్దిగావుందిలే. నువ్వు మరేం బెంగపడక్కర్లేదు!' అన్నాడు వెటకారంగా విశ్వనాథం. సావిత్రికి జవాబు కష్టం కలిగించింది 'మొగవాళ్లింతకన్నా సౌమ్యంగా ప్రవర్తించారా యేం? వాళ్ల తీరే అంత అందులో భార్యలదగ్గిర ఇహ చెప్పనే అక్కర్లేదు!' అనుకుంది సావిత్రి మర్నాటి ఉదయానికి కూడా తలనొప్పి తగ్గలేదు - సెలవు చీటీ రాస్తుంటే అనుకుంది సావిత్రి

'పోనీ యాస్ప్రొ గాని మరేదైనా వేసుకోరాదుటండీ?'

'అన్నీ అయ్యాయి. అంతమాత్రం తెలియక్కాదు!' ఈ మాటూ కొట్టినట్టుగానే జవాబు. చెప్పొద్దూ! సావిత్రికి నిజంగా కోపంవచ్చింది ఇంక మరి మాట్లాడకూడదనుకుంది. మధ్యాహ్నానికి ఒళ్లుకూడా కొద్దిగా వేడెక్కినట్టుంది సావిత్రికేమీ తోచలేదు ఎలాగ? ఆలోచించింది సావిత్రి మెరుపులా తట్టిందొక ఊహ. ఆమె పెదవులమీద చక్కని చిరునవ్వు చిందులు వేసింది. కాఫీ మూడురోజుల్నించీ తాగకపోడంమూలాన కాబోలు ఈ తలనొప్పి! ఎలాగైనా ఆ కాఫీ కాస్త తాగిస్తేనే తగ్గవచ్చు. ఈ ఊహ తన కింతకు ముందు తట్టనేలేదు!.. నెమ్మదిగా పొయ్యి అంటించి చక్కని కాఫీ తయారుచేసింది గ్లాసుతో తీసుకొచ్చి మంచందగ్గరగా నిలబడి పిలిచింది. అతను కళ్లు తెరిచాడు - ఎఱ్ఱగా జ్యోతుల్లాగున్నాయి. 'ఇదుగో పక్కింటావిడ ఏదో పొడరిచ్చింది. అది కాఫీలో కలిపి తాగితే తలనొప్పి తగ్గుతుందిట. లేవండీ! యిదుగో తీసుకొచ్చాను' అంది

'కాఫీనా? తీసుగెళ్ళి మోరీలో పొయ్యి' అన్నాడు విశ్వం

'నామాట వినండీ! పోనీ నాకోసమేనా! మీకు కాఫీ అక్కర్లేకపోయినా ఇదివరకంతా నాకోసం తాగలేదూ? - అల్లాగే తాగరూ!...చల్లారిపోతూంది..' అంటూ జాలిగా అతని కళ్ళల్లోకి చూసింది. ఏ కళనున్నాడో విశ్వనాథం లేచాడు. ఆశ అన్నది అందరికీ వుంటుందిగా! ఓమూల తల పగిలిపోతోంది. తాగి చూద్దాం అనుకున్నాడు. పైగా ఇది తన కిష్టమై తాగటం లేదని సావిత్రికూడా తెలుసుకుంది! ఇంక ఫర్వాలేదు. రెండుగుక్కల్లో కాఫీ తాగేసి గ్లాసు సావిత్రి కందించాడు. అమ్మయ్య! అనుకుంది సావిత్రి.

సావిత్రి ఆ విషయం ప్రస్తావించనూ లేదు. ఒక్కటిమాత్రం నిజం ఆరోజు సాయంత్రమే విశ్వనాథం ముస్తాబై షికారు కెళ్లిన మాట మాత్రం నిజం. కాఫీతోటే తగ్గిందనుకుని నవ్వుకున్నా పైకి అనడానికి సావిత్రి సాహసించలేదు. నొప్పి తగ్గిందనడానికి విశ్వనాథం సిగ్గుపడైనావుండాలి విధి ఏమైనా ఎవరూ ఆ విషయమై ప్రస్తావించలేదు. ఆ మర్నాటినుంచీ అతనూ కాఫీ తాగుతున్నాడు! బహుశా తనకోసం తాను తాగుతూన్నట్టు సావిత్రి ఒప్పుకుంటుందని ధీమా అయివుండాలి!

నెలాఖరున ఇరవైతొమ్మిదో తారీఖుకే కాఫీపొడి అయిపోయింది. 'కాస్త ఆఫీసునుంచి వచ్చేప్పుడు రేపు కాఫీ పొడరు కూడా తీసుకురండి' అంది సావిత్రి అంతక్రితంరోజు రాత్రి. 'అప్పుడే అయిపోయిందా పౌను పొడరూ?' రెట్టించి అడిగాడు విశ్వనాథం.

'అప్పుడే అయిపోయిందా అంటే నేనేవన్నా తినేస్తున్నాననా మీ ఉద్దేశ్యం?' పౌరుషంగా తిరిగి అడిగింది సావిత్రి

'మరింత త్వరగా ఎల్లా అయిపోయింది? ఆకలెక్కువై నువ్వే మింగేసివుండాలి' అన్నాడు. 'పైగా నెలాఖరుని పైసలెలా వుంటాయి? రెండో తారీఖు వరకూ నోటికి తాళం వేసుగో!.'

సావిత్రి కీమాటలలవాటే. అంచేతే నవ్వింది

'మీకే తలనొప్పి వస్తుంది? నాకేం!... అప్పుడు తలనొప్పి పాపం ఎలా తగ్గిందో గుర్తుకు తెచ్చుకోండి!'.. అంది కొంచెం వెంకెతనంగా

'ఓష్! ఇంతోటి వెధవ కాఫీకే తగ్గిందంటావ్! సిగ్గులేకపోతేసరి వేసుకున్న ఆస్ప్రొబిళ్ళ అప్పటికి పనిచేసి తగ్గివుండాలి కాని నీ కాఫీకి కాదు! మాటలు నేర్చిన ఆడదానవు. నదురూ బెదురూ లేదు!'. .సావిత్రి మారుమాట్లాడలేదు.

తెల్లారేక మళ్ళీ కాఫీ కాచింది. విశ్వనాథాని కిచ్చింది. 'అక్కర్లే' దన్నాడు రాత్రి కోపం చల్లారలేదని సావిత్రికి తెలుసు. అల్లా ఒకసారి దగ్గరికి తీసిగెళ్ళి గ్లాసు చూపెట్టకుండా తనే తాగేస్తే మరీ తెగించిందనుకుంటాడని అదీ భయమే!... జాగ్రత్తగా మూతపెట్టివుంచింది ఆఫీసుకు వెళ్తూ అతను డబ్బులు జేబులో వేసుకువెళ్లడం సావిత్రి చూసింది అవి ఎలాగూ కాఫీ పౌడరుకేనని తనకు ఖచ్చితంగా తెలుసు! సాయంత్రానికి కాఫీ పౌడరు ఇంటికి రావడం తథ్యం! మర్నాడు విశ్వనాథం తాగడంకూడా తథ్యం! అతను ఆఫీసుకి అటు వడవగానే ఇటు గ్లాసుడు కాఫీ సావిత్రి గొంతులోకి వెళ్ళిపోయింది. అతని తరహా అది! ఈవిడ తరహా యిది! ఇద్దరూ ఘటికులే...అంచేత వారి సంసారశకట



"అల్లరిసత్వం ఆడివిడిచిన లక్క పిడతలు ఏవి తల్లీ..."




# ఈశ్వర చంద్రుడు

మధురాంతకం రాజారాం

భుగభుగభుగమని పొగలు గ్రక్కుచూ
గూబ గుయ్యిమన కూత పెట్టుచూ
హౌరా స్టేషను ప్లాట్‌ఫారమ్మున
ధూమశకటమూ వచ్చి ఆగినది.
ట్వీడుగుడ్డలా యూనిఫారముతో
తీవిని గూర్చే కళ్లజోడుతో
ముస్తాబైనా యువకుండొక్కడు
'మొదటితరగతి' నుండి దిగాడు.

దిగుతూ, దిగుతూ చెంతనున్న తన
తేలిక పరుపును తెచ్చుకోఅకునై
'కూలీ, కూలీ' అనుచూ నాతడు
గొంతుక నెత్తి పిలిచాడు.
కూలీ లెవ్వరు కనబడనందున
కోపం వచ్చిం దాతనికి!
ఇంతలోన నొక వృద్ధు డచ్చటికి
ఎందుకోనమో వచ్చాడు.

"ఏమయ్యా ఈ పరుపును కాస్త
ఇంటిదగ్గరకు తెస్తావా!
బేడో, పావో ఇచ్చెదలే" అని
బింకముగా నతడన్నాడు.
మారుపలుక కా వృద్ధుడు పరుపును
మోసికొనుచు తన వెంబడి రాగా
బూట్ల టకటకలు భూదివమ్ములను
బ్రద్దలుజేయగ నడిచాడు!
గృహామును జేరి, పరుపును దించీ
వృద్ధుడాతనికి వినమ్రుడై
"అయ్యా! ఏదో శక్తికొలదినే
సాయము జేసితి నంతేను!
ఇంతమాత్రమున కెందుకు కూలీ
నిత్తురు బాబూ! వద్దండీ!
ఎన్నటికైనా అవసరమొస్తే
నన్నే పిలవం"డన్నాడు.

ఆ మాటలు విని ఆశ్చర్యముతో
అత డీలా ప్రశ్నించాడు:
"ఎక్కడుందువని నిన్ను పిలుతు, నీ
ఇల్లు ఎక్కడో చెబుతావా!"

పెదవులపై లేనవ్వు చెలుగగా
వృద్ధుం డిట్లని చెప్పాడు!
"ఈ కలకత్తాపట్టణమందున
ఎల్లరునూ నన్నెరుగుదురు.
ఈశ్వరచంద్ర విద్యాసాగరు
డెక్కడనన్నచో చెప్పెదురు!"
"ఏమేమీ" అని భయభ్రాంతుడై
యువకుడు గడగడ వణికాడు.
మహనీయుం డగు ఈశ్వరచంద్రుడు
మెల్లగ ఇంటికి నడిచాడు.



# ఆదర్శస్నేహము

పి. జి. స్వామి

హుమాయూను చక్రవర్తి ఢిల్లీ పరిపాలించుచున్న కాలం. ఢిల్లీకి సుమారు యిరవై మైళ్లదూరంలో వొక గ్రామముండేది. అది నది వొడ్డునవున్న గ్రామం. ఆవూరి చుట్టూ వుద్యాన వనాలున్నాయి. ఆతోటల్లో పండ్ల చెట్లు అన్ని జాతులూవున్నాయి. చెట్లకొమ్మలు పండ్లతో నిండిపోయేయి. ఒకనాడు ఉదయంఆరున్నరవుతుంది. అప్పుడు సుమారు పదిహేనేళ్ల వయస్సుగల యిద్దరు కుఱ్ఱవాళ్లు నదివొడ్డున వున్న వొక తోటలోని చెట్టుకింద కూర్చున్నారు. అందులో వొకని పేరు అజిత్కుమారుడు. రెండవ వానిపేరుదాదూ లేక తోడర్మల్లు. జగద్విఖ్యాతి పొందిన తోడర్మల్ల తడే. అప్పుడు వారిద్దరికీ యీక్రింది సంభాషణ జరిగింది.

అజిత్ : దాదూ! నువ్వు ఢిల్లీ యెప్పుడు వెళతావూ?

దాదూ : నాలుగైదు రోజులలో వెళ్లదల్చుకున్నాను.

అ : అసలు నువ్వెందుకెళ్లాలి? మానాన్నగారూ, యీ అజిత్కుమారుడూ నీకు విసుకెత్తించు తున్నారా?

దా : అది యెన్నటికీ కాదు. [illegible], నాతల్లిగారూ, మిమ్మల్ని మరిచిపోగలమా. నిరాధారంగా వున్న మాయిద్దర్నీ ఆదరించి మీ తండ్రిగారు నీతో సమానంగా నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసేరు. ఈ రోజువరకూ మమ్మల్ని అతి ప్రేమతో చూస్తున్నారు. ఇక నీ సంగతి చెప్పనక్కరలేదు. వొకే కంచం, వొకే మంచం. నీకేదుంటే నాకూ అదిప్పించేవు.

అ : అయితే నువ్వెందుకెళ్లాలి? నువ్వు లేకపోతే నాకు వొక నిమిషం కూడా తోచదు. నీతోకూడా మీ అమ్మగార్ని తీసుకెళ్తున్నావే. ఆమె వుంటేనువ్వెప్పుడేనా వొస్తావని ఆశ నువ్వెళ్లవొద్దు దాదూ.

దా : వెళ్లాలి కుమార్. మీ తండ్రిగారి దయవల్ల మంచి ముసద్దీనయేను. భూములూ, వాటి సారమూ తెలుసుకుని విలువకట్టుట, కొలతలు వేయుట, అన్నీ నేర్చుకున్నాను ఇక నాస్వశక్తిమీద ఆధారపడి నాతల్లిని సంరక్షించడానికి నిశ్చయించేను. దానికి మీ తండ్రిగారి అనుమతీ, ఆశీస్సూ పొందేను. ఇప్పుడు ఢిల్లీలోకూడా వారి స్నేహితుడైన అమరేంద్ర వల్లభుని పేర ఆయన వొకజాబు వ్రాసి, యిక్కడ మీవల్లయెంత ఆదరణ పొందుతున్నామో ఆలాగే అక్కడ కూడా జరిగే యేర్పాటుచేసేరు.

అ : ఇంతకీ నీ నిశ్చయం మార్చ వన్నమాట. సరే నన్ను మాత్రం మరిచిపోకు నామనస్సుయెల్లప్పుడూ నీమీదే వుంటుంది.

దా : ఎంతమాటన్నావూ! నువ్వు శ్రీమంతుల బిడ్డవు. మరిచి పోతే నువ్వుమరిచిపోవాలి కాని, యీశరీరంలోని ప్రతీ అణువు లోనూ, మీతండ్రిగారూ, తల్లి గారూ, నువ్వూ, ప్రతిబింబిస్తూ వుంటారు

అ : మేమేమి శ్రీమంతుల్లం! నరేంద్రబాబూగారికంటేనా? వారి ముందు మేమెంత!

దా : నిర్గంధ కుసుమం యెంత సుందరమైనదైతేనేం. అటువంటి నరేంద్రులు వెయ్యిమందైనా మీ తండ్రిగారితో సమానులుకారు.

అ : సరే దానికేంలే, నీతో వొకటిచెబుతానువిను. వయస్సులో మనమిద్దరం వొకటైనా, బుద్ధి లోనూ, భుజబలంలోనూ నువ్వు నాకంటె కోటిరెట్లు అధికుడివి. ముందుముందు నువ్వు అసాధారణమైన కీర్తిసంపాదిస్తావని మాతండ్రి గారుచెప్తూవుంటారు. అట్టిసమయం రావాలని నేను యెల్లప్పుడూ భగవంతుణ్ణి ప్రార్థిస్తూవుంటాను. అప్పుడు నీ సోదరుడు అజిత్కి నీ హృదయంలో కొంచెం చోటుంచు దాదూ! (అని కంటనీరు పెట్టడం ఆరంభించేడు) వెంటనే తోడర్మల్లతణ్ణి కౌగలించుకుని,

దా : అదేమిటి కుమార్! ఆడదానిలాగ యేడుస్తున్నావు? నీతో వొక్కసంగతి చెబుతున్నాను విను. అదిగో మనకెదురుగా ఆదేవాలయంలోవున్న జగజ్జనని సాక్షిగా

# ★ ఆదర్శ స్నేహము ★

సర్వకాల, సర్వావస్థలందునూ నువ్వు నాకుజ్ఞాపకముంటావు. నాకు సోదరుడైనా, బంధువుడైనా, స్నేహితుడైనా, నువ్వే. నీతల్లిదండ్రులు నాదైవములు. (అని వొకరినొకరు విడవకుండా అలాగ కొంత సేపు నిశ్శబ్దంగా వున్నారు.)

ఆ గ్రామానికి అజిత్కుమారుని తండ్రి, ప్రేమనాథుడు పెత్తనదారుడు. తాతల నాటి మాన్యాలున్నాయి. ధనధాన్య సమృద్ధిగల కుటుంబం. అతడు నిజంగా ప్రేమ మూర్తి· ఆపద్బాంధవుడు. ఆచుట్టు ప్రక్కలంతటికీ ప్రేమనాథుడంటే అతిగౌరవరం· ఎంతమంది అతనివల్ల పోషింపబడ్డారో, ఉపకారాలు పొందేరో లెక్కలేదు. తోడర్మల్లుతండ్రి పేదవాడు. అతడు ప్రేమనాథుని వల్లనే పోషింపబడేవాడు. వ్రాతలలోనూ, లెక్కలలోనూ ప్రేమనాథుకు సహాయం చేస్తూవుండేవాడు. తోడర్మల్లు నాలుగేండ్ల బాలుడై యుండగా అతని తండ్రి చనిపోయేడు. చనిపోయేముందు తన భార్యనీ, కుమారునీ పోషించమని ప్రేమనాథుని ప్రార్థించేడు. ఆలాగే వాళ్ళిద్దర్నీ ప్రేమనాథుడు తన యింట్లోనేవుంచి సంరక్షించేడు. తోడర్మల్లు మంచిబలమైన శరీరమూ, అతిసూక్ష్మబుద్ధీ, మంచి సౌందర్యమూ గలవాడు. అందరి యెడలా వినయవిధేయతలతో సంచరించేవాడు·

నాలుగు రోజులైన తరవాత తోడర్మల్లూ, తల్లీ, ఢిల్లీకివెళ్ళేరు· స్నేహితుణ్ణి విడవలేక, విడవలేక అజిత్కుమారుడు చాలా దూరం సాగనంపి యింటికి వొచ్చేడు. ప్రేమనాథుని స్నేహితుడైన అమరేంద్రుడు మొగలు దర్బారులో వొక సన్మాని. ఆ స్థాన నాయకులలో వొకడు. అతడు తోడర్మల్లుకి, వొక చిన్న లేఖకోద్యోగమిప్పించేడు. అది భూమిసంబంధమైన ఆఫీసు. తోడర్మల్లు తనకిచ్చినపని వేగం ముగించి, యితరులపనికూడా చేస్తూ అందరి మెప్పుపొందుతూ, ఆఆఫీసుని అంతా త్వరలోనే గ్రహించేడు. నాలుగైదేళ్ళ యీసరికి, ఆఫీసులో యేభోగట్టా కావలసి వొచ్చినా అతడు వెంటనే యిచ్చేవాడు· ఏవిషయంలో సలహా కావలసినా అతణ్ణే అడిగేవారు·

ఈవిధంగా రోజులు గడుస్తున్నాయి. అప్పుడప్పుడు తన క్షేమం ప్రేమనాథుకు తెలియజేస్తూ, అతని క్షేమం తెలుసుకుంటూ వుండేవాడు. ఏ విషయంలో సలహా కావలసివచ్చినా అతణ్ణే అడిగేవాడు. చాలాసార్లు అజిత్కుమారుడు ఢిల్లీవొచ్చి, స్నేహితునితో సంతోషంగా కాలం గడుపుతూ వుండేవాడు. తీరిక సమయాల్లో తోడర్మల్లు, అమరేంద్రునివద్ద వీణ వాయించడం నేర్చుకొని కొంత కాలానికి మంచి వైణికుడయేడు.

ప్రేమనాథుని వూరిలో, అతనికంటే ధనికుడూ, పెద్దభూస్వామీ, నరేంద్రబాబు వుండేవాడు. అతడన్ని విషయాలలోనూ, ప్రేమనాథుకి వ్యతిరేకి. ప్రేమనాథుని సత్కీర్తి, పలుకుబడీ చూసి సహించలేక నరేంద్రుడతని పైని పగ పూనేడు. నరేంద్రుడంటే యెవరికీ కిట్టదు. ఎందుచేతంటే, అతడు మాయోపాయాలలో చతురుడు. తేనె పూసినకత్తి. ఎంతమందినో మోసంచేసి, తన సంపద అభివృద్ధి చేసుకున్నాడు. ప్రేమనాథుని నాశనంచేసిఅతని పెత్తనదారు పదవి సంపాదించడానికి సమయం కొరకు నిరీక్షిస్తున్నాడు. అట్టి తరుణం కూడా వొచ్చింది.

హుమయూను చక్రవర్తిపైని సూర్ వంశస్థుడైన షేర్షా తిరుగుబాటుచేసి, వోడించి ఢిల్లీ సింహాసనం ఆక్రమించేడు. ఆ సమయంలో రాజ్యంలో కొంత అల్లకల్లోలం పుట్టింది. షేర్షాయొక్క సేనాని, మహమ్మదు రఫీఖాన్ అనే వాడొకనాడుకొంత సైన్యంతో ప్రేమనాథుడున్న వూరికొచ్చేడు. అతణ్ణి ముందుగా నరేంద్రనాథుడు కలుసుకుని కావలసిన సన్నాహాలన్నీ చేశాడు. అందుచేత ఖానుకి అతనిపైని దయ కలిగింది. ఆవూరి పెత్తనదారు నరేంద్రుడే అనుకుని 'ఏమండీ, పెత్తనదారుగారూ!' అని ఖాను సంబోధించేసరికి నరేంద్రు డడ్డం వొచ్చి, 'క్షమించాలి, ఖానుగారూ! నేను మావూరిలోకల్లా పెద్ద భూస్వామినీ, ధనవంతుడినీ, అయినప్పటికీ నాకు పెత్తనదారు పదవి సర్కారువారివ్వలేదు. మావూరిలో ప్రేమనాథుడనే ఆసామీకి ఆ పదవి యిచ్చేరు.' అన్నాడు. 'ఎందుచేత' అని ఖాను ప్రశ్నించేడు. 'ఆయన తండ్రికి ఆ [illegible]

వుండేది. అతడు చనిపోయిన తరవాత నేను యే విధంగా చూసినా ప్రేమ నాధునికంటె అధికుణ్ణి కాబట్టి పెత్తనదారీ నాకిప్పించమని వొక అర్జీ పెట్టుకున్నాను. కాని ఢిల్లీలో అప్పుడు సరియైన బుద్ధిమంతులు లేని కారణంచేతనూ, ప్రేమనాధుని తీపి మాటలచేతనూ, అతణ్ణే నియమించేరు. ఇప్పుడు ధర్మప్రభువు షెర్షా పరిపాలన వొచ్చింది మీవంటి న్యాయప్రియులైన అధికార్లున్నారు. నాకు న్యాయం దయచేయించుతారని ఆశిస్తున్నాను. మీ వంటి ఉన్నతోద్యోగులు వొచ్చినప్పుడు పెత్తనదారు హాజరై వుండొద్దా? ఆలా చెయ్యకపోయినా ఫర్వాలేదని ఆయన ధీమా' అని నరేంద్రుడన్నాడు. వెంటనే ఖానుకి కోపంవచ్చి గడ్డం సవరించుకుని, మీసాలు తిప్పుతూ వొక సేవకుణ్ణి పిలిచి పెత్తదారుని నిలుచున్నపాటుని తీసుకురమ్మని పంపేడు. ప్రేమనాధుడు పూజా మందిరంలో వుండుటవల్ల ఖానుగారి దర్శనానికి రావడ మాలస్యమైంది. ఈలోగా నరేంద్రుడదంతా ఖాను యెడల నిర్లక్ష్యమని చెప్పి శలవు తీసుకుని వెళ్లేడు.

ప్రేమనాధుడు రాగానే ఖాను ఉగ్రమూర్తి అయి నానా దుర్భాషలూ ఆడి పెత్తనదారు పదవినుండి తొలగించేమని చెప్పేడు. అన్నీ విని ప్రేమనాధు డతి శాంతంగా 'ఆపని బాదుషావారు చెయ్యాలి. మీరు చేసినా చెల్లదు.' అన్నాడు. ఖాను నిప్పుతొక్కిన కోతిలాగ గెంతడం, తెగవాగడం ఆరంభించేడు. అది చూచి యింకా అక్కడుంటే తన మర్యాదా దక్కదని ప్రేమనాధుడింటికి వెళ్ళేడు.

మర్నాడు ఖాను ఢిల్లీకి తిరిగి వొచ్చి పాదుషాతో వున్నవీ లేనివీ కల్పించి చెప్పేడు. ప్రేమనాధుడు హుమయూను పక్షం ప్రజలను ప్రోత్సహించి తిరుగుబాటుకు సిద్ధంగా వున్నాడని చెప్పేడు. అది విని పాదుషా అతణ్ణి పెత్తనదారు పదవినుండి తొలగించి, అతని యావదాస్తీ నరేంద్రుడికిచ్చేసి, ఆ వూరినుండి వెళ్లగొట్టమని వొక ఫర్మానా యిచ్చేడు. ఖాను స్వయంగా వెళ్లి ఆ ప్రకారంగా చేసేడు. అటుతరువాత ప్రేమనాధుడూ, కుటుంబమూ యెక్కడికి వెళ్లేరో, యేమయేరో, యెవరికీ తెలియదు. అకస్మాత్తుగా వాళ్ల భోగట్టా తెలియకపోవడంవల్ల తోడర్మల్లు అన్ని సంగతులూ కనుక్కుని వాళ్లగురించి యెన్నో ప్రయత్నాలు చేసేడు. కాని కార్యం లేకపోయింది.

కొంతకాలానికి తోడర్మల్లు ఆ స్థానంలో వొక ముఖ్యోద్యోగి అయేడు. షెర్షా చనిపోయిన తరవాత వొకరి తరవాత వొకరిని తెరమీద బొమ్మల్లాగ ఢిల్లీ సింహాసనం యెక్కిస్తున్నారు; దింపుతున్నారు. హుమయూను తిరిగీ ఢిల్లీ సింహాసనం సంపాదించేడు కాని త్వరలోనే చనిపోయేడు. అక్బరు చక్రవర్తి అయేడు. రాజ్యంలోని అల్లకల్లోలాలు కొంతవరకూ అణగిపోయేయి. ఆస్థానంలోని ఉద్యోగు లెవరెవరెటువంటి వారో కనిపెట్టగలిగే సామర్థ్యం వుంది అక్బరుకి. తోడర్మల్లు మంచి ఆర్థికవేత్త అనీ, మంచి సేనాని అనీ తెలుసుకున్నాడు. అతడికి వున్నతోద్యోగమిచ్చి 'రాజా' బిరుదమిచ్చి తన అంతరంగిక స్నేహితులలో వొకడుగా పరిగణించేడు.

సంవత్సరాలు గడిచిపోయాయి బంగాళంలో తిరుగుబాటు జరిగింది. అది అణచడానికి చక్రవర్తి తోడర్మల్లుని పంపించేడు. అతి చతురతతో యుద్ధంచేసి, శత్రువులనోడించి రాజమహాలువద్ద తన సైన్య శిబిరం యేర్పాటు చేసుకుని వొక పెద్ద భవనంలో తోడర్మల్లు వున్నాడు జయించిన బంగాళం, ఒరిస్సా రాష్ట్రములలో శాంతి భద్రతలు స్థాపించమని చక్రవర్తి ఆజ్ఞ అయింది. అందుచేత అక్కడ కొంతకాలం తోడర్మల్లు వుండవలసి వొచ్చింది. చక్రవర్తి ఫర్మానాలు ఆ రెండు రాష్ట్రాలలోని వివిధ ప్రాంతాలలో వున్న చిన్న వుద్యోగస్థులకి పంపించవలసి వుంది. అనేక వేల ఫర్మానాలున్నాయి. వొక్కొక్కదానికి నేక వేల కాపీలు తయారు కావాలి. అందుకొరకు చాలామందిని మునష్షీలని చిన్న జీతాలిచ్చి నియమించేరు. తాత్కాలికంగా తోడర్మల్లు సుబాదారు పదవిలో వున్నాడు. తన ఆఫీసు వేరె వొక మందిరంలో పెట్టించేడు.

కొన్ని వందలమంది మునష్షీలు రాత్రింబగళ్లు ఫర్మానా కాపీలు వ్రాస్తున్నారు. అప్పుడప్పుడు సుబాదారుగారు చూసి తనవద్దనున్న చక్రవర్తి సీలు తన సమక్షంలో వేయించి క్రింద వుద్యోగులకి పంపుతున్నాడు. అది రోజూ జరుగుతూన్న పని. వొకనాడు కొన్ని ఫైయిరు

# ★ ఆదర్శ స్నేహము ★

కాపీలు అతడు చూడడం తటస్థించింది. ఆ దస్తూరీ చూడగానే తోడరమల్లు కళ్లలో నీళ్లు తిరిగి మరి చెయ్యికదలలేదు. ఆ డిపార్టుమెంటు అధికారిని పిలిపించి ఆ వ్రాత వ్రాసిన వాడెవరు యేలాగుంటాడనిఅడిగేడు. అతనిచేతికింద సుమారు నూరుమంది గుమాస్తాలున్నారు కాబట్టి మళ్ళీ తన డిపార్టుమెంటుకివెళ్ళి వొచ్చి యీవిధంగా చెప్పేడు, అతనిపేరు ఫకీర్చందు. సన్నగా, పొడవుగా వుంటాడు, చాలినంత భోజనంవుంటే శరీరం సువర్ణచ్ఛాయలో వుండును. కాని పేదరికంవల్ల ఛాయ తగ్గి వుంది. ముఖం మంచి వర్చస్సుగలది. పూర్వమెప్పుడో విలువగల దుస్తులు, మాడిపోయిన జల్తారూ, కుట్లూ మాసికలూగలవి ధరిస్తాడు. అందరికంటె ముందు ఆఫీసుకివొచ్చి, అందరూ వెళ్ళిన వొకగంటకి వెళతాడు. వొకరితో మాట్లాకుండా తనపని తాను చేసుకుంటాడు. వూరిలో యిల్లకి అద్దె యివ్వలేక, వూరిచివరిని వొక శిథిలమైన యింట్లో తనూ, భార్యా, యిద్దరుపిల్లలూ, మిక్కిలి ముసలితనంలోవున్న తల్లిదండ్రులూ నివసిస్తున్నారు.

ఆ మాటలు వింటున్నంతసేపూ తనలో రేగిపోతున్న తుపాను పైకి తెలియనియ్యకుండా ముఖం కిందికి దించి ఫర్మానాలు చూస్తూ కూచున్నాడు తోడరమల్లు. అంతా విన్న తరవాత ఆ వుద్యోగివేపు చూసి, 'ఆ ముసద్దీని వెంటనే పనిలోనుండి తొలగించు. మా ఆజ్ఞపొందకుండా తన యిల్లువిడిచి యెక్కడికీ వెళ్లకూడదని మా శాసనం' అన్నాడు. వుద్యోగి తెల్లబోయి! మహారాజా! నిరుపేదవాడు. తనపని అందరికంటె చక్కగా, శ్రద్ధగా చేస్తున్నాడు. మిక్కిలి వినయవిధేయతలు గలవాడు. ఇంకా యెక్కువ వేతనం యిప్పించమని ప్రార్థిస్తున్నాను' అన్నాడు. ఆలోగా తోడరమల్లు తనుయిచ్చిన ఆజ్ఞ వ్రాయించి, చక్రవర్తి సీలువేయించి, 'అధికప్రసంగం చెయ్యక, మా ఆజ్ఞ ప్రకారం చెయ్యి. నువ్వు చాలా చెప్పేవు కాబట్టి ఆ కుటుంబానికి కావలసిన భోజనపదార్థాలు మన కందాలోంచి పంపించు.' అని చెప్పి తోడరమల్లు లోపలికి వెళ్లేడు.

ఆ ఫర్మానా పట్టుకుని ఆ వుద్యోగి తిరిగీ ఆఫీసుకివెళ్లి యివ్వలేక, యివ్వలేక, ఫకీర్చందుకిచ్చి 'మీరు కొంచెంసేపుండండి. నవుకర్లిద్దర్ని మీతో పంపించుతాన'న్నాడు. ఫకీర్చందు (నిజంగా అజిత్కుమారుడు) ఆ ఫర్మానా చదువుకుని గంభీరంగా, 'మీసుబాదారుగారి ఆజ్ఞ శిరసావహిస్తాను. నే నెచ్చటికీ తప్పించుకుని వెళ్లను. వెళ్లేస్థితిలో లేను. మీ నవుకర్లని పంపి మా యింటికి కాపలా పెట్టనవసరం లేదు' అన్నాడు. 'అది కాదు చందుబాబూ! మీకు కావలసిన ఆహారపదార్థాలు సమకూర్చమని సుబాదారువారి ఆజ్ఞ. అవి

## గుర్తు పట్టలేదు

వెంగళప్ప: (బజారులో వెడుతూఉంటే రామయ్య ఎదురవడ్తాడు) ఏమండీ! రామయ్యగారూ! యీమధ్య ఎవరండీ కాలధర్మంఅయినారని విన్నాను? మీరా? లేక మీ తమ్ముడు లక్ష్మయ్యగారా?

రామయ్య: అదేమిటోయి? అఘాయిత్యపు మాటలు మొదలుపెట్టినావు? నోరుముయ్.

వెంగళప్ప: చిత్తం చిత్తం. లేదు లేదు. క్షమించండి. రామయ్యగారూ! మీరూ మీ తమ్ముడు లక్ష్మయ్యగారూ కవలపిల్లలవడంచేత ఒక్కటేమాదిరిగా ఉంటారు. అందుచేత పనిపోయింది మీరో లక్ష్మయ్యగారో తెలియక అన్నాను క్షమించండి.

(సినిమా స్టూడియోలో)
ఒక తార మరొక తారతో :
చెప్పులో కాలైనా పెట్టలేదు. ఇంతలో కారు హారన్ వినిపించింది.

రెండో తార : ఏంపాపం! చెప్పులో కాలు పెట్టలేదంటున్నావ్ — కాలికి కూడా బోగ నచ్చిందా!

పట్టుకుని వాళ్ళు మీ వెంటవస్తారు' అని వుద్యోగి చెప్పేడు. 'ఆయన చూపిన కరుణకి నా కృతజ్ఞత తెలియజేయండి. కాని భిక్షలాగ యిచ్చిన కానుకలందరాలు పుచ్చుకోవడం నా కలవాటు లేదని చెప్పండి' అని వెనక్కి చూడకుండా అజిత్కుమారుడు వెళ్లేడు. ఆ సంగతి తోడర్మల్లుకి ఆ వుద్యోగి తెలియజేసేడు.

అజిత్కుమారు డింటికి వెళ్లి జరిగినసంగతి తండ్రితో చెప్పేడు. అది మన అదృష్టమే. మన దరిద్ర దేవత మనల్ని యింకా విడిచిపెట్టలేదు అని వాపోయేడు. 'అజిత్! ఆరాటపడకు. భగవంతుని నమ్మితే ఆయన దయ మనమీద కలుగకతప్పదు' అని ప్రేమనాథుడన్నాడు. 'అట్టి సుదినం వొస్తుందనుకోను. నా మాటకేంగాని, చిన్నప్పట్నించీ పదిమందికి పెట్టి, గౌరవంగా కాలక్షేపం చేసిన మీకు యిట్టి దీనావస్థ వొచ్చించికదా అని నా విచారం' అని అజిత్ కంటనీరు పెట్టుకున్నాడు. ఆ నాడా కుటుంబానికి భోజనం లేదు.

చీకటిపడిన తరవాత తోడర్మల్లు రెండు పెద్దపెట్టెలనిండా విలువైన బట్టలూ, మరో పెట్టెనిండా మిఠాయిలూ పెట్టించేడు. అవి నవుకర్ల చేత మోయించువుని, తన ముత్యాలపల్లకీలో కూర్చుని, పరివారంతో సహా బయల్దేరేడు. తనతో చెప్పిన వుద్యోగిని పిలిపించి, ఫకీర్చందు యింటికి తోవచూపమన్నాడు. భయపడుతూ అతడు తోవచూపెడితే అందరూ పోయి ఆ యింటిముందాగేరు. వొక గుర్రపు రౌతు దిగి తలుపు, ద్వారం లేని ఆ యింట్లోకి వెళ్ళేడు. ఆ యింట్లో వొకమూలని చిన్న ఆముదపుదీపం వెలుగుతున్నది. 'సుబాదార్ మహారాజ్!' అని ఆ రౌతు వొక కేకవేసేడు. ఇంట్లోవాళ్లు భయంతో గడగడ వొణుకుతున్నారు. అంతట్లో, అటూ, యిటూ అనేక దివిటీల వెలుతురులో పెట్టెలు పట్టించుకుని తోడర్మల్లు లోపలికొచ్చేడు.

ప్రేమనాథుడూ భార్యా, వొక చింకిచాపమీద కూచున్నారు. అజిత్కుమారుడు వాళ్ల దగ్గిర నిలుచున్నాడు. అతనిపిల్లలిద్దరూ ఆ వెల్తురికి నిద్రనించి లేచి ఆశ్చర్యంతో వొచ్చినవాళ్లని చూస్తున్నారు. అజిత్ భార్య ముగమ్మీద ముసుగు వేసుకుని వొకమూలని నిలుచుంది. వొస్తూనే తోడర్మల్లు 'అజిత్' అంటూ అతణ్ణి కౌగలించుకుని, 'బాబా, మాయీ' అంటూ ఆ ముసలిదంపతుల ముందు మోకరించేడు. అతని కంటివెంట నీరు ప్రవహిస్తున్నది. 'ఈ పాడు కళ్లతో మిమ్మల్ని యిట్టి నికృష్ట స్థితిలో చూచేటంత పాపం చేసుకున్నాను.' అని, తను తెచ్చిన మిఠాయీలు పెట్టించి విలువైన వస్త్రాలు వాళ్ల కిచ్చి, వాళ్లు వేసుకున్న తరవాత వాళ్లపంక్తిని కూచుని ఆ మిఠాయి తిన్నాడు. ఇదిచూచి పరివారమంతా ఆశ్చర్యంలో మునిగిపోయేరు. ఆ వుద్యోగి, పరిస్థితులు గ్రహించి అర్జంటుగా మరి నాలుగు పల్లకీలు తెప్పించేడు. అందరూ సుబాదారు భవనం చేరుకున్నారు.

అప్పుడు అజిత్ 'దాదా! ఆ

# ★ ఆదర్శ స్నేహము ★

నాడు నీతో చెప్పలేదూ, నీకు మహోన్నతపదవి వొస్తుందని. ఇప్పుడు నిన్ను చూసి మా కష్టాలన్నీ మరిచిపోయేం. అయితే నాకు యీ వేళ నువ్వెంత కఠినమైన ఫర్మానా యెందుకుపంపేవు?' అన్నాడు. 'నీ దస్తూరీ చూడగానే నా కపరిమితానందం కలిగింది. నీ వంటివాడు యీ చిన్నవుద్యోగంలో వుండడమా అని అలాగ చేసేను. మీరు నిస్పృహతో యెక్కడికైనా పోతారేమో అని వెళ్లకూడదని ఆజ్ఞాపించేను. భోజనసామగ్రులు నిరాకరించేవనగానే నువ్వు మారుపేరు పెట్టుకున్నా, నా అజిత్తువే అని నిశ్చయించుకున్నాను. కాని మీకు యీ దీనావస్థ యెలా గొచ్చింది?' అన్నాడు సోదర్మల్లు.

అజిత్కుమారుడు నరేంద్రనాధుని ద్రోహం అంతా వివరించాడు. తాము కొద్దిపాటి విలువగల నగలు పట్టుకుని పాట్నా చేరి అక్కడ వొక బంధువునివల్ల మోసగింపబడి ఆ నగలుపోగొట్టుకున్నట్టు చెప్పేడు. ఆ తరవాత అనేకకష్టాలు పడి తుదకు రాజమహాలు చేరి వర్తకులవద్ద లెక్కలు వ్రాసుకుంటూ, అనేక వస్తులుంటూ, తుదకు మునసద్దీగా చేరడం అంతా చెప్పేడు. సోదర్మల్లు మిక్కిలి విచారించి వారిని తనతో ఢిల్లీకి తీసుకుపోయేడు.

ప్రేమనాధుని యొక్క ఆస్తి అంతా తిరిగి అతని కిప్పించడమే కాకుండా, నష్టపరిహారం క్రింద నరేంద్రుని ఆస్తిలో సగం యిప్పించేడు. చక్రవర్తితో చెప్పి అజిత్కుమారుడికి ఆస్థానంలో వుద్యోగమిప్పించేడు. ప్రేమనాధుడు 'దాదా! నిన్నెలాగభినందించడమో తెలియదు' అన్నాడు. అంటే 'మరి వేయిజన్మలెత్తినా మీ ఋణం తీర్చుకోలేను. మీరు నాకు చేసిన మేలులో యిదివొక అణుమాత్రం. ఇక ఆ సంగతి యెత్తకండి' అని సోదర్మల్లు చెప్పేడు.

అజిత్తు సంగీతప్రియుడు. సోదర్మల్లూ అతడూ ఒకరినొకరు కలుసుకున్న సమయాలలో సోదర్మల్లు తన వీణాగానంవల్ల అజిత్తుని సంతోషపెడుతూ వుండేవాడు. ★



'కాఫ్యాధారం పాత్రం? పాత్రాధారం కాఫీ?'

ఫోటో : నాగం వనజాగుప్తా (రాజమండ్రి)

# ప్రతిఫలం

మూలం: ఛాసర్ — అనువాదం: "చిట్టిబాబు"

పూర్వం ఒక పట్టణంలో ఒక మఠాధికారి ఉండేవాడు. అతడు చెడ్డపనులు చేసేవారిని శిక్షించటంలో చాల కఠినంగా ప్రవర్తించేవాడు. మంత్రవిద్యలతో మాయమాటలు చెప్పి ప్రజల్ని మోసపుచ్చేవారిని, అధికమైన వడ్డీలకు అప్పులిస్తూ అన్యాయంగా డబ్బు గడించేవారిని, దేవునికిసంబంధించినపనుల్ని సరిగా నిర్వర్తించకుండ ఉండేవారిని, ఇంకా ఇతరత్రా తప్పులు చేసినవారిని చాల కఠినంగా శిక్షిస్తుండేవాడు. అతడి శిక్షకు పాత్రులైనవారు మరెన్నడూ అట్టి తప్పుల్ని చేయటానికి సాహసించేవారు కాదు. అంతగా అతడు శిక్షించే వాడన్నమాట.

ఆ మఠాధికారి దగ్గర ఒక బంట్రోతున్నాడు. వాడు తెలివితేటలలో అఖండుడు; మోసం చేయుటంలో మొనగాడు. అతడి పనేమంటే - ఎవరైనా అవినీతి పనులు చేస్తుంటే వారిని శిక్షించి, వారిదగ్గరనుండి కొంతధనం వసూలు చేసి మఠాధికారికివ్వటం - అందుకని అవినీతిపరుల ఆచూకీ తీయటానికి అనేకమంది గూఢచారుల్ని నియమించాడు. పాపుల దగ్గర పాప పరిహారార్థం వసూలు చేసిన పైకంలో సగానికి పైగా తాను మింగేయటం, మిగిలింది మఠాధికారికివ్వటం మామూలుగా జరుగుతుండేది. అంతేగాకుండా, మఠాధికారికి తెలియకుండా తాను స్వయంగా వెళ్లి అవినీతిపరులదగ్గర గదమాయించి డబ్బు వసూలు చేస్తుండేవాడు. ఇక వాళ్లు మఠాధికారి వేసేశిక్షలనుండి తప్పించుకోటానికిగాను యీ బంట్రోతుగాడికి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనంపెట్టి, కొంత పైకం వాడికి లంచంగా ఇచ్చుకొని సాగనంపుతుండేవారు. ఇది మామూలుగా అలవాటైపోయింది అందరికి.

ఒకరోజు ఈ బంట్రోతుగాడు ఒక ముసలి అవ్వను గదమాయించి డబ్బు సంపాదిద్దామని ఒక అడవి మార్గాన గుర్రంమీద పోతున్నాడు. దారిలో వీడికి ఇంకో బంట్రోతు ఎదురయ్యాడు. అతడు పచ్చని గుడ్డలు, విల్లంబులు, నల్లనిటోపీ ధరించి వున్నాడు. ఇద్దరూ స్నేహంగా పలుకరించుకున్న తరువాత "ఎందాకా వెళ్లుతున్నావ్? చాలాదూరం వెళ్లాలా?" అని క్రొత్తవాడు ప్రశ్నించాడు పాతవాడిని. "అబ్బే లేదు. ఈ దగ్గరలో ఉన్న ఒక అవ్వదగ్గర శిస్తు వసూలు చేయటానికి వెళ్తున్నా" అని జవాబిచ్చాడు బంట్రోతు.

"నీవు న్యాయస్థానాల్లో వుండే బంట్రోతువా?"

"అవును" అని అనుమానంగా జవాబిచ్చాడు తన అసలు పని చెప్పుకోటానికి సిగ్గుపడుతూ. "ఓ అదా సంగతి. నేనూ నీవంటివాణ్ణే. నీ కిష్టమైతే మనిద్దరం స్నేహంగా వుందాం - ఏమంటావ్? నేను ఈ ప్రాంతాలకి కొత్తవాణ్ణయినా నాకూ చాలా ఆస్తి వుంది. ఎప్పుడైనా మాయింటికి వెళ్దాంలే" అని తన విషయమంతా చెప్పేశాడు కొత్త బంట్రోతు.

"నాకు చాలా ఆస్తివుంది" అన్న మాటలు మనవాడికి ఆశని కలిగించినై. "నేను ఇంతమందికి టోపీ వేస్తున్నాను, యీ నల్లటోపీవాడికి మాత్రం టోపీ వేయలేనా?" అని మనసులో అనుకొని పైకి ఇలా అన్నాడు.

"ఓ. మనిద్దరం నేటినుండి శాశ్వతంగా స్నేహితులమై సంచరిద్దాం" అని ఇద్దరూ వాగ్దానాలు చేసుకొన్నారు. తరువాత ఇద్దరూ ఒకే వైపు వెళ్లసాగారు.

దారిలో అతివాగుడుగాడైన పాతబంట్రోతు కొత్తవాణ్ని అనేక ప్రశ్నలు వేయసాగాడు. కొత్తవాడి ఇంటికి దారి తెలుసుకొంటే ఎప్పుడైనా వాడియింటికి వెళ్ళి ఏదో ఒక విధంగా డబ్బు సంపాయించవచ్చని వీడిఆశ. అందుకనే "మీరెక్కడ నివసిస్తుంటారో చెప్తే నేను ఎప్పుడైనా రావటానికి వీలుగావుంటుంది" అని కొత్తవాణ్ని అడిగాడు. దానికి కొత్తవాడు "మన నగరానికి ఉత్త

## ★ ప్రతిఫలం ★



రంగావుంటున్నా. ఇప్పుడు కాకపోయినా మరొకనాడైనా నీవు అక్కడకి రాక తప్పదు. మనిద్దరం విడిపోయేలోగా మాయింటికి రావటానికి దారి చెప్తానులే. అందువల్ల నీకు ఇబ్బంది కలగదు" అని జవాబిచ్చాడు.

కాని పాతవాడికి మరొక అనుమానం కలిగింది. అదేమంటే తన స్నేహితుడు డబ్బు ఏవిధంగా సంపాదిస్తున్నాడా అని. అందుకని ఇంకో ప్రశ్న వేశాడు. "సరేగాని! నీవూ ఒకడిదగ్గర బంట్రోతువే, నేనూ ఒకరిదగ్గర బంట్రోతునే. అందువల్ల మన రహస్యాలు ఒకరికొకరం చెప్పుకున్నా ఫరవాలేదు. ఏమంటావ్?"

"ఓ! అందులో ప్రమాదమేముంది?" అని కొత్తవాడన్నాడు.

"నీవు డబ్బు సంపాదించటానికి ఏయేపద్ధతులు అవలంబిస్తావో నాకు కొంచెం చెప్పు?" అని అడిగాడు.

"ఓ! దానికేం. చెప్తాను. నాకు జీతం తక్కువ. పని ఎక్కువ. అందులో మా అధికారి అతి క్రూరుడు. అందువల్ల పొట్టపోషించుకోటానికి అనేక మార్గాలద్వారా డబ్బు గుంజుతుంటాను"

ఈమాటలువినేసరికి బంట్రోతుగాడికి అమితసంతోషంకలిగి "అరె నావిషయంకూడా అంతే!" అని తన్నుగురించి డబ్బా కొట్టుకోవటం ప్రారంభించాడు. "నేను సంపాదించగలిగినంత సంపాదిస్తున్నాను. ఏవిధంగా సంపాదిస్తున్నానో ప్రస్తుతం చెప్పలేను. డబ్బు అంటే నాకు చేదుకాదు. అమిత ప్రాణం. డబ్బు అశాశ్వతం అనేవాళ్ళంటే నాకు అమితమంట. వాళ్ళందర్ని కొరతవేయాలి. ఏమంటావ్ భయ్యా!" అని తన స్నేహితుణ్ని అడిగాడు. అతడు "అవును" అని వూరుకున్నాడు.

"ఆ! ఇంతకూ నీ పేరేమిటన్నావ్?" అని పాతవాడు ప్రశ్నించాడు.

"నిజంగా చెప్పాలంటారా?" అని అడిగాడు రెండోవాడు.

"ఫరవాలేదు చెప్పు." అని మన బంట్రోతుగాడు బలవంతం చేశాడు.

"అయితే నేను దయ్యాన్ని. నా నివాసస్థలం నరకలోకం. కాని నేనుమాత్రం భూలోకంలో సంచరిస్తూ మానవులిచ్చేదాన్ని పుచ్చుకుంటుంటాను. నీ మాదిరిగా నేనూ డబ్బు అనేకమందిదగ్గర గుంజుతుంటాను. డబ్బుకోసం ప్రపంచమంతటా తిరుగుతుంటా" అని బంట్రోతువంక చూశాడు. ఇంకేం బంట్రోతు? వాడు నీళ్లు కారిపోతున్నాడు. "నేను దయ్యాన్ని" అన్నమాటలు వినే

సరికి వాడి ప్రాణం పైకే పోయినంత పనయింది. పాపం! దయ్యం గాడికి జాలేసింది.

"అరె - ఎందుకు భయపడతావ్? నీకు నేను హానిచేయను" అని వాడ్ని బుజ్జగించాడు.

"అయితే! నీవు దయ్యానివా? బంట్రోతువు గాదన్నమాట" అని వణుకుతూనే అడిగాడు దానికి దయ్యం తలవూపి వూరుకొంది.

"అయితే! తెలియక అడుగుతాను. మీ దయ్యాలకి మామనుష్లే ఆకారాలుంటాయన్నమాట!" ఏమీ చేయనన్నాడని ధైర్యంతో అడిగాడు.

"మాకు ఒక నిర్ణీతమైన ఆకారమేమీ లేదు. మా యిష్టం వచ్చిన ఆకారంలో మేము కన్పడుతుంటాం. ఒకప్పుడు మానవాకారం; మరొకప్పుడు దేవతాకారం; ఇంకొకప్పుడు కోతి ఆకారం ధరించి యీ ధరామండలమంతా తిరుగుతుంటాం. మేము కోరినదానికోసం వివిధ ఆకారాలు దాలుస్తుంటాం" అని డాంబికంగా మాట్లాడింది దయ్యం. బంట్రోతుగాడికి అనుమానా లెక్కువ. అందుకని వాడు ఇంకో ప్రశ్న వేశాడు. "అయితే! మీకు యిష్టమైన ఆకారాలు దాల్చే శక్తి వుందిగదా మరి డబ్బుకోసం ప్రపంచమంతా తిరగటం దేనికి?"

"దానికి చాలా కారణాలున్నాయి. అవి నీకు ఇప్పుడు నేను చెప్పినా అర్థంకావు. కాని మమ్మల్ని గూర్చి నీవు చాల త్వరలో సంపూర్తిగా తెల్సుకోగలవ్ ప్రతిదానికి ఒక వేళ వుంది." అని చెప్పి "చాలా ప్రొద్దెక్కింది - నాకు యింతవరకేం గిట్టలేదు. తొందరగా పోదాం పద. నీవు వద్దనేదాకా నీ వెంటే వుంటాను" అని దయ్యంఅంది. మన బంట్రోతుగాడి పరిస్థితి అధ్వాన్నంగా తయారయింది. "దయ్యాన్ని పొమ్మంటే దానికి కోపంవచ్చి ఏంచేస్తుందో" అని పైకి యిలా అన్నాడు.

"అదెప్పటికీ జరగదు - నేను నీకు స్నేహితుడుగా వుంటానని వాగ్దానం చేశాను. నీవు దెయ్యాని వైనాసరే నామాట నిలబెట్టుకుంటా. ఇక మనపని మనం చూసుకుందాం. నీకు దక్కింది నీవు తీసుకో. నాకు దక్కింది నేను తీసుకుంటా. ఆఖరికి ఎవరికి లాభంవస్తే అది చెరిసగం చేసుకుందాం. ఏమంటావ్ భయ్యా!" అని అడిగాడు.

"ఓ. అలాగే" అని దయ్యం అంది.

ఈవిధంగా మాట్లాడుకుంటూ వాళ్ళొక గ్రామందగ్గరకి వచ్చారు. అక్కడ ఒక వడ్లబండి బురదలో

 

# ప్రతిఫలం



దిగబడివుంది. బండివాడు ఎద్దుల్ని చావమోదుతున్నాడు. పాపం! ఎద్దులకి పట్టు చిక్కటం లేదు. ఈ వింతచూస్తూ మన బంట్రోతులు కొంచం దూరంగా గుర్రాల్ని ఆపారు. రైతుకు మండి ఎద్దుల్ని తిట్టటం ప్రారంభించాడు. "అర్ - ఛో, మీాకు మాయరోగం రాను. మిమ్మల్ని దయ్యం ఎత్తుకపోను. కదిలి చావరేం?" అని అదిలిస్తున్నాడు.

బంట్రోతుగాడికి ఒక ఉపాయం తట్టింది. కొంచెంసేపు రైతును ఏడిపించాలని బుద్ధిపుట్టి దయ్యంతో యిలా అన్నాడు. "విన్నావా ఆ బండివాడనేమాటలు? ఎద్దుల్ని నిన్నుతీసుకోమంటున్నాడు ఆలస్యం ఎందుకూ? ఊ - తీసుకో వాటిని" అని పురమాయించాడు.

"అది గాదు - వాడమాటలు వూరికనే అంటున్నాడు. అంతే - నిజంగా ఎత్తుకపొమ్మనిగాదు - అతణ్ని అడుగు - లేకపోతే కొంచెంసేపు చూస్తూవుండు నీకే అర్థమాతుంది" అని దయ్యంగాడు అన్నాడు.

బండివాడు ఎద్దుల్ని చావమోదటంతో అవి గట్టిగా పట్టుబట్టినయి. బండి బురదనుండి బయటపడింది. ఎద్దుల్ని మెచ్చుకుంటూ బండివాడు బండి తోలుకొని పోయాడు.

"నేను చెప్పలా నీకు - వాడు అన్నమాటల అర్థం ఒకటి, వాడి ఉద్దేశ్యం మరొకటి. కాబట్టి నాకేం లాభం లేదు. పోదాంపద" అని ఇద్దరూ కలసి అవ్వాయింటికి వెళ్లారు.

"ఈఇల్లే అవ్వది. ఇదొట్టి పిసినిగొట్టు. పిల్లికి బిచ్చంపెట్టదు. ఒక్క దమ్మిడీపోతే దాని ప్రాణంపోతుంది ఎట్లాగైనా దానిదగ్గర డబ్బు సంపాదించాలి. ఎట్లా డబ్బు సంపాయించాలో తెలుసుకో" అని బంట్రోతుగాడు దయ్యంగాడిని హెచ్చరించాడు.

"అవ్వా! తలుపుతియ్యి" అని తలుపు కొట్టాడు. అవ్వ "ఎవరూ?" అంటూ వచ్చి తలుపుతీసి "ఏం పని బాబూ?" అని అడిగింది.

"నీవు మతాధికారిదగ్గరకు రావాలి." అని బంట్రోతు అనగానే అవ్వ అదిరిపోయింది.

"నాకు జబ్బుగా వుంది. నేను ప్రయాణం చేయలేనిస్థితిలోవున్నా - నాబదులు ఎవరైనా మతాధికారి దగ్గరకు రావచ్చునా బాబూ?" అని అడిగింది.

"అవ్వా! అందాకా దేనికి? నీవు పన్నెండు రూపాయలు ఇచ్చావంటే నిన్ను వదలిపెట్తాను. నీవు మతాధికారిదగ్గరకు రావలసిన అవసరం తీరిపోతుంది. ఈ డబ్బువల్ల నాకేం లాభంలేదు. ఇదంతా మా అధికారికి పోతుంది. ఊ. డబ్బిచ్చేయి. వెళ్ళిపోవాలి. ఇక్కడ ఆలస్యం చేయటానికి వీల్లేదు. మాకు చాలా పనుంది" అని తొందరపెట్టాడు.

"అమ్మయ్యో! పన్నెండురూపాయలే!" అని అవ్వ గుండె బాదుకుంటూ "పుట్టి బుద్ధెరిగినతరువాత నేను పన్నెండురూపాయలు సంపాదించే ఎరగను. నన్ను వదలిపెట్టు బాబూ నీకు పుణ్యం వుంటుంది. పేదదాన్ని - అందులో ముసలిదాన్ని. నన్ను బాధించకు" అని దగ్గుకుంటూ బ్రతిమిలాడసాగింది.

"అదేం వీలు గాదు. నీవు చచ్చినాసరే నేను వదలిపెట్టను" అని బంట్రోతుగాడు భీష్మించాడు.

"నేను ఏంపాపం చేయలేదు నాయనా. భగవంతుడి సాక్షిగా చెప్తున్నా" అని మొరపెట్టుకోసాగింది అవ్వ.

"అదంతా నాకు తెలియదు. డబ్బిచ్చేయి. మునుపొకసారి నిన్ను వదిలిపెట్టా - అప్పుడు కూడ డబ్బిస్తానని ఎగగొట్టావు. ఈసారి నిన్నువదల్ను. ఊ - యివ్వు" అని తొందరచేశాడు.

"ఇది అంతా అబద్ధం. ఇంతకు ముందు నీ ముక్కు ముఖం నేనెరగను" అని "నీకేం పోయేకాలం వచ్చిందిరా, నిన్ను దయ్యం ఎత్తుకపోను" అనీ తిట్టసాగింది.

ఇదే సమయమని దయ్యంగాడు ముందుకువచ్చి "ఏమిటంటున్నావు అవ్వా?" అని అడిగాడు.

"చూడు బాబూ! వీడికి పోయేకాలం కాకపోతే నన్ను బాధిస్తాడా? వీణ్ణి ఏ దయ్యమైనా ఎత్తుకుపోతే బాగుండు" అని అంది. దాంతో బంట్రోతుకు మండి "నీపెట్టె పగలగొట్టి పైకం తీసికెళ్తా - నీకెవ్వరు అడ్డం వస్తారో చూస్తా" అని ఇంట్లోకి పోబోయాడు. వెంటనే దయ్యంగాడు అడ్డంవచ్చి యిలా అన్నాడు.

"ఆగరా భయ్యా! నీవు [illegible]

# న్యూస్ రీల్

(3-వ పేజీ తరువాయి)

జెనీవా సమావేశంలో చీనా సూచించిన కార్యక్రమాన్ని అమెరికా నిరాకరించింది.

—భారతదేశంలో కుటీర పరిశ్రమలను గురించి పరిశీలించిన ఇంటర్నేషనల్ ప్లానింగ్ టీమ్ నివేదిక ప్రచురించబడింది.

—కాంగ్రెస్‌వాదుల కర్తవ్యం గురించి అధ్యక్షుడు జవహర్లాల్ నెహ్రూ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలకు ఉత్తరువు లిచ్చారు.

**ఆదివారం, జూన్ 6 :**

—ఢాకా (తూర్పు బెంగాల్) లో యునైటెడ్ ఫ్రంట్ పార్టీ సమావేశాన్ని తూర్పు బెంగాల్ గవర్నర్ ప్రభుత్వం నిషేధించింది.

—విజయవాడ, హైదరాబాద్, మొదలైన రేడియో కేంద్రాలలో 20 కిలోవాట్ల ట్రాన్స్‌మిటర్లను నెలకొల్పడానికి భారత ప్రభుత్వం నిర్ణయించిందని డా॥ కేస్కర్ అహ్మదాబాద్‌లో ప్రకటించారు.

**సోమవారం, జూన్ 7 :**

—ఇండోచీనాలో యుద్ధవిరమణ పర్యవేక్షణకు ఇండియా, పాకిస్తాన్, ఇండోనీషియా, బర్మా, సింహళాల ప్రతినిధుల ఆర్బిట్రేషన్ కమిషన్ నిర్మించాలని ఫ్రెంచి విదేశాంగమంత్రి చేసిన ప్రతిపాదనను రష్యన్ విదేశాంగమంత్రి మాలటోవ్ నిరాకరించినట్లు జెనీవా వార్త.

—ఏప్రిల్ 26 మొదలు కలకత్తాలో అప్పుడప్పుడు పడుతున్న వర్షపు నీటిలో కనపడుతున్న రేడియో ఆక్టివిటీ చిహ్నాలు క్రమంగా తగ్గుతున్నాయని కలకత్తా విశ్వవిద్యాలయాధ్యాపకు లొకరు ప్రకటించారు.

—జాతీయ మహిళా కాంగ్రెస్ కలకత్తా సమావేశం స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు ఇవ్వాలనీ, సమానమైన పనికి స్త్రీ పురుషులకిచ్చే వేతనాలలో వ్యత్యాసం చూపే పద్ధతి రద్దు పరచాలనీ తీర్మానాలు చేసింది! గృహిణుల తీరికకాలం చిన్న చిన్న గృహపరిశ్రమలకు వృత్తులకు వినియోగపడేవిధంగా ప్రభుత్వం శిక్షణ కేంద్రాలను విరివిగా స్థాపించి ప్రోత్సాహమివ్వాలనికూడా కోరుతూ ఒక తీర్మానం చెయ్యబడింది.

—మలేరియా నివారణకుగాను జాతీయ ప్రచార సప్తాహం ఢిల్లీలో ఆరోగ్యశాఖామంత్రిణి రాజకుమారి అమృతకౌర్ గారిచేత ప్రారంభించబడింది.

—ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని కేంద్ర హిందీ విశ్వవిద్యాలయంగా మార్చే కార్యక్రమంపట్ల అసమ్మతి తెలుపుతూ ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనేట్, ఎకాడమిక్ కౌన్సిల్ సంయుక్త సమావేశం తీర్మానం చేసింది.

—నిరుద్యోగాన్నీ దారిద్ర్యాన్నీ నివారించాలంటే సాగుభూములను సక్రమంగా భూములు లేనివారికి పంచడం ఒక్కటే మార్గమని యూనియన్‌మంత్రి జగజీవనరామ్ ఇండోర్‌లో అన్నారు.

ఆంధ్రదేశంలో ఖనిజసంపదను గురించి సమగ్రంగా పరిశీలించాలని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం చేసిన విజ్ఞప్తికి భారతప్రభుత్వం అంగీకరించినట్లు కర్నూలు వార్త.

**మంగళవారం, జూన్ 8 :**

—ఇండోచీనాలో కొత్త ఫ్రెంచి సైనికాధికారి జనరల్ ఎలీకి కమ్యూనిస్టు సైనికాధికారవర్గాలతో సంప్రతించాలని ఫ్రెంచి ప్రభుత్వం ఈ ఉత్తరువు లిచ్చినట్లు జెనీవా వార్త.

—బ్రిటన్ మొదలైన ప్రభుత్వాలు తోడ్పడితే ఇండోచీనా యుద్ధంలో ఏదో ఒక రూపాన అమెరికా ప్రత్యక్ష జోక్యం చేసుకోవాలని తలపెట్టిందనీ, కాని బ్రిటన్ సమ్మతించనందువల్ల ఐసెన్‌హోవర్ ప్రస్తుతానికి అట్టి అధికారం ఇవ్వాలని కాంగ్రెసును కోరడం జరగలేదనీ అమెరికన్ విదేశాంగమంత్రి డల్లెస్ వాషింగ్టన్‌లో ప్రకటించారు.

—జెనీవా సమావేశమన్ని 90 రోజులూ పూర్తిగా గమనించవలసిన అవసరం లేదనీ, ఇంక కొరియాను గురించి జెనీవా సమాలోచనలు నిష్ప్రయోజనమనీ దక్షిణ కొరియా విదేశాంగమంత్రి సింగ్మన్‌రీ ప్రభుత్వానికి తెలియపరిచినట్లు సియోల్ వార్త.

—ఇండోచీనాలో నియమించబడవలసిన తటస్థరాజ్యాల పరిశీలక సంఘంలో ఎవరికీ వీటో అధికారం ఇవ్వబడరాదని ఫ్రెంచి విదేశాంగమంత్రి బిడాల్ట్ అన్నారు. ఇండోచీనా యుద్ధవిరమణను గురించి వెంటనే ఒప్పందానికి రావడం అవసరమని ప్రకటించారు.

—కొలంబో రాజ్యాలను (ఇండియా, పాకిస్తాన్, ఇండోనీషియా, బర్మా, సింహళం) ఆర్బిట్రేషన్ కమిషన్‌గా నియమించాలని జెనీవాలో బ్రిటిష్ విదేశాంగమంత్రి ఈడెన్ ప్రతిపాదించారు.

—వియత్నామ్, లావోస్, కాంబోడియాలలో ఒక్కసారే యుద్ధం విరమించబడాలని కాంబోడియా ప్రతినిధి జెనీవా సమావేశంలో ప్రతిపాదించారు.

—తెలంగాణాను విడిగా ఉంచడ్ తెలుగురాష్ట్రంగా స్థాపించాలని సూచిస్తూ డా॥ చెన్నారెడ్డిగారు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని హైదరాబాదు ఆంధ్ర కాంగ్రెస్ ఆమోదించింది.

—ద్వితీయ పంచవర్ష ప్రణాళిక చాలవరకు విదేశాల సహాయంమీద ఆధారపడి వుంటుందని యూనియన్ ఆర్థికమంత్రి దేశ్‌ముఖ్‌గారు మద్రాసులో పత్రికా ప్రతినిధులతో ప్రసంగంలో చెప్పారు.

—గుంటూరులో హైకోర్టు స్థాపనవల్ల విజయవాడ తెనాలినుంచి గుంటూరుకు ప్రత్యేక రైల్వే ప్రయాణ సౌకర్యాలను జూలై 1 నుంచి ఏర్పాటు చేస్తున్నట్లు దక్షిణ రైల్వే అధికారులు ప్రకటించారు ★



నాసొత్తు: ఆ అవ్వ నిన్ను నాకు దానం చేసింది. నీవు నా వెంట రాక తప్పదు-అని చెప్పి బంట్రోతుగాణ్ని గట్టిగా పట్టుకున్నాడు.

"నన్ను వదలిపెట్టు: నీ కెంత డబ్బు కావాలంటే అంత డబ్బు యిస్తా" అని బంట్రోతుగాడు కాళ్ళా వేళ్ళా పడబోయాడు - కాని దయ్యంగాడి కివేమీ రుచించలా. వాడి జుట్టు పట్టుకొని నరక లోకానికి లాక్కుపోయాడు. ★

## మనోహరా వారి

# 'మనోహర'

"తివిరి రాముని బాణమ్ము
త్రిప్పవచ్చు,
ఏటిపోటున కెదు రీత్తి
యీదవచ్చు,
బట్టతలమీద జుట్టు
రాబట్టవచ్చు,
ఆడదాని ఆశనుబట్టి
ఆపలేము."

అని మనోహరవారి "మనోహర"లో ఒక తేటగీతి పద్యం ఉంది. 'ఇందులో ఆఖరి పాదం తీసి వేసి 'ప్రేక్షకుల అభిరుచి కనిపెట్టలేము' అని చేరిస్తే బాగుంటుందేమో.

"మనోహర" తమిళ చిత్రం తమిళ దేశంలో పెద్ద విజయం పొందింది. తెలుగుచిత్రం కూడా తెలుగు దేశంలో బాగా పోతోందనీ, ప్రజలు ఆనందిస్తున్నారనీ తెలుస్తోంది.

బి. ఏ. సుబ్బారావుగారి 'రాజు-పేద'లో రేలంగి, అమ్మాజీ.

"అన్నదాత" లో రైతులందర్నీ సమష్టి క్షేమంకోసం సమీకరిస్తున్న నాగేశ్వరరావు.

గానే, "క్షణక్షణముల్ సెన్సార్ల చిత్తముల్" అని మరొక అర్థాంతర న్యాసం చేయవచ్చు. ఈ సెన్సారున్నారే, వీరికి ఏక్షణాన ఏది అశ్లీలంగా తోస్తుందో, ఏది సుశ్లీలంగా తోస్తుందో చెప్పడం బ్రహ్మ తరం గాదు.

"అది అసలే నీలో లేదా?
మరి పుట్టుకతోనే దేవుడు
నిన్ను బట్టబయలుగా
వదిలేశాడా?"

అనే పాట సెన్సార్లకు అర్థమై ఉండదు. ఒక వేళ అర్థమైతే, మంచి నాజూకైన మాట లనుకుని వదిలేసి ఉంటారు

తక్కినవాటి సంగతి దేవు డెరుగును గాని, 'ఎంటర్టెయిన్‌మెంట్' పుష్కలంగా కలిగిన యీ చిత్రం నిర్మాతలకు లాభాలు చేకూర్చిపెడుతుందని ఆశించవచ్చు. 

# ★ సినిమా వార్తలు ★

## కొత్త టెక్నిక్

పర్‌స్పెక్టా - స్టీరియో ఫోనిక్ సౌండ్ అనే కొత్త టెక్నిక్‌ను ఎమ్. జి. ఎమ్, పారమౌంట్, వార్నర్ బ్రదర్స్ కంపెనీల వారు అవలంబించారు ఈ టెక్నిక్ న్యూయార్కులో గత ఏప్రిల్‌లో ప్రదర్శింపబడింది ఈ టెక్నిక్‌ను విశదీకరిస్తూ కొన్ని దృశ్యాలు, ఎమ్. జి. ఎమ్ వారు తీసిన చిత్రాల్లోని కొన్ని దృశ్యాలు చూపించబడినప్పుడు చాలా ప్రశంసలు వచ్చాయట. ఈ టెక్నిక్ లో ఉన్న విశేష మేమంటే, స్టీరియో ఫోనిక్ శబ్దం రికార్డు చేయడానికి వేరు వేరు ట్రాక్‌లు కాక, ఒకే ట్రాక్ ఉపయోగించబడుతుంది. ఈ టెక్నిక్‌లో తీయబడిన చిత్రాలకోసం థియేటర్లలో ఎట్టిమార్పులూ చెయ్యనక్కరలేదట.

* * *

ప్రతిభావారి చిత్రం (రేచుక్క) దాదాపు సగం తయారైంది. జూన్, జూలై నెలల్లో నిర్విరామంగా నెప్ట్యూన్, రేవతీ స్టూడియోలలో వరసగా సెట్లు వేసి, ఆగస్టు కల్లా చిత్రం పూర్తిచేసి, ఆ నెలలోనే విడుదలచేయాలని నిర్మాతలు ఆలోచిస్తున్నారు.

* * *

"రాజా - పేద" బహుశా ఈ నెల 18 వ తేదీన విడుదలచేస్తామని నిర్మాత, దర్శకుడు బి. ఏ. సుబ్బారావుగారు చెబుతున్నారు.

* * *



మోహన్‌స్టూడియో (బొంబాయి)లో "మొఘల్-ఇ-ఆజాం" సెట్‌లో ఒకభాగం.

భారత చలన చిత్ర నిర్మాతల సంఘం (బొంబాయి) వారి 16 వ వార్షిక సమావేశంలో ప్రముఖ నిర్మాత దల్ సుఖ్ ఎమ్. పంచోలీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. ప్రముఖ నిర్మాతలైన శాంతారాం, మెహబూబ్, కర్దార్, సొహరాబ్ మోడీ, హోమీ వాడియా, రాజ్ కపూర్, ఎస్. కె భట్, తోలారాం జలాన్, బాబూరావ్ పాయ్ ఈ సంఘంనుండి ఇటీవలనే రాజీనామా ఇచ్చారు.

ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన వీరుడు టెన్సింగ్ నార్కే, హాలీవుడ్‌లో ట్వెంటియత్ సెంచరీ ఫాక్స్‌వారి "సేబర్ టూత్" అనే చిత్రంలో నటించడానికి అంగీకరించాడు. ఈ చిత్రంకోసం ఎవరెస్ట్ శిఖరాన్ని పరిసరదృశ్యాలను విమానాలమీదనుంచి షూట్ చేస్తారట.

* * *

సినిమాపరిశ్రమకు ఆర్థికంగా దోహద మిచ్చేబదులు ప్రభుత్వం పరిశ్రమను మరింత తన అదుపులోకి తెచ్చుకోడానికి ప్రయత్నిస్తున్నదని ఇండియన్ మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ ఎసోసియేషన్ కొత్త అధ్యక్షుడు దల్ సుఖ్ పంచోలీ అన్నారు. నేషనల్ ఫిల్మ్ బోర్డును స్థాపించడానికి నిశ్చయించినట్లు ప్రభుత్వం చేసిన ప్రకటనపై వ్యాఖ్యానిస్తూ, ఫిల్మ్ ఇంక్వైరీ కమిషన్ నివేదికలో సినిమాపరిశ్రమను బలపరిచే అంశాలను మాత్రం ప్రభుత్వం నిరాకరించిం

## ★ సినిమా వార్తలు ★

దన్నారు. (పన్నుల భారాన్ని కొంత తగ్గించాలని ఇంక్వైరీ కమిషన్ నివేదికలో సూచించబడింది.) క్లిష్ట స్థితిలో ఉన్న సినిమాపరిశ్రమను బ్రిటన్‌లో ప్రభుత్వం ఆదుకుంటోంది అసలింతవరకూ సినిమాలు సమాజానికి ప్రయోజనకరమైనవో కావో మన ప్రభుత్వం నిశ్చితంగా తెలుసుకున్నట్లు లేదని పంచోలీ అన్నారు.

[ఫిల్మ్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా కార్యవర్గం ప్రభుత్వ ప్రకటనగురించి చర్చించడానికి సమావేశమౌతోంది.]

*　　*　　*

భారతదేశంలో సినిమా స్కోప్‌ను విశేషంగా ప్రచారంలోకి తీసుకురావాలనే ఉద్దేశంతో ట్వెంటియత్ సెంచరీ ఫాక్స్ కార్పొరేషన్ (ఇండియా) వారు ఢిల్లీ, బొంబాయి, కలకత్తా మూడు థియేటర్లను యాజమాన్యం వహించడానికి ఏర్పాట్లు చేశారు.

ఇదిగాక భారతసినిమాపరిశ్రమ యజమానులు కొందరి సహకారంతో మన దేశంలో సినిమాస్కోప్ చిత్రాలు నిర్మించడానికికూడా సన్నాహాలు జరుగుతున్నాయి దీనితోపాటు మనదేశంలో నిర్మించబడే కొన్ని మంచి చిత్రాలను విదేశాలలో విడుదలచెయ్యడానికి ట్వెంటియత్ సెంచరీఫాక్స్ కార్పొరేషన్ కృషి చేస్తుంది.

*　　*　　*

ఈమాసం బెర్లిన్‌లో జరుగుతున్న ఫిల్మ్ ఫెస్టివల్‌లో దేవకీబోస్ నిర్మించిన "భగవాన్ శ్రీకృష్ణ చైతన్య" చిత్రాన్ని ప్రదర్శిస్తారు.

*　　*　　*

త్రీడీ చిత్రాలంటే నిజానికి విడివిడిగా ప్రదర్శించడానికి వీలైన రెండు చిత్రాలే కాబట్టి, త్రీడీ చిత్రాలపైన మామూలు చిత్రాలపైకంటె రెట్టింపు పన్ను వసూలు చెయ్యాలని సెంట్రల్ రెవిన్యూబోర్డు నిర్ణయించింది. ★



ప్రతిభావారి "రేచుక్క"లో చంద్రయ్యగా జోగారావు.

## గ్రంథస్వీకారము

**శతపత్రసుందరి :—** గేయసంపుటి; రచయిత: బాలాంత్రపు రజనీకాంతరావు; వెల 3-0-0; ప్రకాశకులు వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 490 తిరువొత్తియూర్ హైరోడ్డు, చాకలిపేట, మద్రాసు-21.

"శతపత్ర సుందరీ! ఓహో శతపత్ర సుందరీ!" అని సూర్యకుమారి పాడిన పాట విననివారెవరూ ఉండరు. నూరు రేకులుగల తామరపువ్వు వాస్తవ ప్రపంచంలో ఎక్కడా గోచరించేది కాదు గనుక, భావకవులు నిరంతరం అన్వేషిస్తున్న మనుసువే అలభ్యమూ, అతిలోకమూ అయిన సౌందర్యానికి అది సంకేతమని భావించవచ్చును. కనుక, రజనీకాంతరావుగారు తమ గేయాల సంపుటికి 'శతపత్ర సుందరి' అని నామకరణం చేయడం బాగానే ఉంది. వీరి గేయాలలో అంతటా అతి సుకుమారమైన సౌందర్యాన్వేషణ కనిపిస్తుంది ప్రేమ, విరహం, వసంతోత్సవం, మధువు, మంచు, వెన్నెల ఇత్యాదులనే వీరు ఎక్కువగా తమ కావ్యసామగ్రిలో చేర్చుకొన్నారు.

"జీవిత మాయొలగా
ఊగెద తియ్యని కలగా...
తెలిమబ్బుల నురగలలో
తెలివెన్నెల తరగలలో
పయనించు చంద్రనౌకలో
శయనించే తారాకోమలినై
జీవిత మాయొలగా
ఊగెదతియ్యనికలగా..."

అనే మన స్తత్వం వీరిగేయాలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇది కొందరికి పలాయనవాదంగాను, మరికొందరికి అసలైన జీవిత వేదాంతంగాను కనిపిస్తుంది. ఈ భిన్న దృక్పథాలమధ్య కవిత్వపు విగ్గు తేల్చడానికి కావ్యశిల్పం చాలవరకు సహాయకారి అవుతుంది. శిల్పదృష్ట్యా చూస్తే ఈ గేయాలు ఉత్తమశ్రేణిలో చేరకపోవచ్చును. సంగీతప్రధానంగా రచించిన గేయాలలో కావ్యశిల్పం కొరవడడం సామాన్యంగా జరిగే పనే.

రజనీకాంతరావుగారు మంచి గాయకులు. సంగీత సాహిత్య సంస్కారాలు రెండూ కలిగినవారవడంచేత వీరి గేయాలు పాడుకొని భావోన్మీలనంపొందడానికి అనువైనవి. ఆయన స్వయంగా తనే పాడినవీ, సూర్యకుమారి, రాజేశ్వరరావు, ఘంటసాల, భానుమతి, ఎస్ వరలక్ష్మి మున్నగువారిచేత పాడించినవీ అనేక సుప్రసిద్ధ గేయాలు ఈ సంపుటిలో ఉన్నాయి యువలోకాన్ని, ముఖ్యంగా విద్యార్థిలోకాన్ని ఈ సంపుటి తప్పకుండా ఆకర్షిస్తుందనడంలో సందేహం లేదు

విశ్వాత్ముల నరసింహామూర్తి, దశిక రామలింగేశ్వరరావుగార్లు రచించిన త్రివర్ణ ముఖచిత్రం చాలా ఆకర్షవంతంగా ఉంది పింగళి లక్ష్మీకాంతంగారు ఆశీర్వాక్యాలు వ్రాశారు ఈ సంపుటికి 1958 సంవత్సరపు ఉత్తమ ఖండకావ్య సంపుటిగా మదరాసు ప్రభుత్వం బహుమతి ఇచ్చింది.

**సినీరాణి :—** సచిత్ర సినిమా మాసపత్రిక; ప్రథమ సంచిక వెల 0-8-0; ఎడిటర్. మహేశ్వర్; పబ్లిషర్ : డి. బాబు. ★

## తిరునాళ్ళు

(8-వ పేజీ తరువాయి)

సంయమనే చోటైనా సంపాదించారు – ఆ పాశ్చాత్యసోదరుడుకూడా తన కెమేరాతో సహా వాళ్ళెక్కిన పెట్టెలోనే యెక్కాడు, బండి కదిలేసమయానికి అంతా కుదుటపడి. కూర్చునో, ఒకళ్ళ నొకళ్ళు చేరగిలబడో, సర్వజన సౌదర్యభావం సెన వేసుకు పోయిందేమో అన్నట్లుగా ఒకరినొకరు అన్యోన్యం హత్తుకుని కూర్చున్నారు – విదేశీ యాత్రికుడు పురుషోత్తాన్ని చూసి "మర చెంబు సంపాదించేవే" అని ప్రశంసా సూచకంగా తల పంకించాడు. "పురుషోత్తం, చిట్టచివరికి కొన్నావుట్రా, మర చెంబూ" అని అడిగాడు శేషావతారం మర చెంబు చేతపుచ్చుకుని. "ఏయిన చెంబేరా బాబూ యిది. ఒక ముద్రాడు అమ్మ చూపాడు చవగ్గాను – ఇదిగో – పి. పి. షణ్ముఖ్యమూర్తుల పురుషోత్తం పేరు పాడి అక్షరాలు" అన్నాడు! – రైలు కదిలింది;- మళ్ళీ కొండలమీంచి చల్లగాలి కిటికీలోంచి కొడుతోంది! మహంమంచి పుణ్యం చేసుకున్నాంరా... ఈవేళ అన్నాడు శేషావతారం. శుభ్రంగా కొత్తగా కనిపించేటట్లు తోముడంవల్ల ధగధగా పొడ్కుమీా చంద్రుడిలా మెరిసే మర చెంబు పరిశీలిస్తూవుంటే చుట్టుపక్కల ప్రయాణీకుల సంభాషణలు మాత్రం మెల్లిమెల్లిగా శేషావతారం మనస్సులో చిన్ని చిన్ని సుడిగుండాలు తిరుగుతూ కరిగిపోవారంభించాయి – రైలు కిటికీలోంచి ఎదురుగా కనిపించే చంద్రలోకంలోకి శేషావతారం అర్ధనిమీలితుడై తేలిపోయాడు – రైలు దిగి ఇంటికివెళ్ళి చేరుతోగానే – అతని భార్య ఎదురేగి "ఏమండీ, దేముడికి ఏమని దణ్ణంపెట్టుకున్నారో చెప్పరూ" అనడుగుతోంది, ప్రసాదా లందిపుచ్చుకుంటూ! – "ఏమని పెట్టుకున్నానూ, ఏమని పెట్టుకోలేదే..." శేషావతారం మళ్ళీ ఆలోచనలో పడ్డాడు– "దేముడికి నమస్కరించినప్పుడల్లా మనస్సు నిర్మలమై నిశ్చలమైపోయి పైకి చూసిన ఆ మూర్తిని మళ్ళీ మనస్సులో ధ్యానించి తన్మయుం కావడం తప్ప–ఫలానా కోర్కె కోవాలని కోగలేగ– ఏమిరా పురుషోత్తం – ఈ సంగతి చెప్పు" అని పక్కకి తిరిగేసరికి చంద్రలోకం కరిగి – రైలు పెట్టెలో కూమున్న పురుషోత్తం పక్కనే అతనికి బోధిస్తున్నాడు; – "రోజూ నాకు తిండియ్యి బట్టయియ్యి అని అడగడం కంటె చిరునవ్వుతోనో కృతజ్ఞతతోనో తండ్రియైన భగవంతునితో తాదాత్మ్యం పొందడమే సరనుకుంటాను" అని. అయితే, ఇంటి కెళ్ళాక మా ఆవిడ అడిగితే ఆమెకి అలాగే చెప్తాను" అనుకుని మళ్ళీ చంద్రలోకానికి తేలిపోయాడు శేషావతారం. ★

## ★ కాలక్షేపం ★

(5-వ పేజీ తరువాయి)

తనకు బాల్యదశలో మృత్యుగండం తప్పించవలసినదని యీశ్వరుణ్ణి ప్రార్థించారుట. ఆ ప్రాణగండం ఆయనకు తప్పింది. ఆయన చిరంజీవియైనాడు. శాశ్వతంగా చిరకాలం బ్రతికిఉండడం ఎందుకయ్యా అంటే, భగవద్భజన శాశ్వతంగా ఎల్లకాలమూ చేస్తూ ఉండడానికి ఈ చేతులు ఉండాలి, యీ నాలుక ఉండాలి, యీ కాయము ఖాయముగా ఉండాలి అన్నాడు.

కనుక "తనువుపై మన కింత తనుక మేల?" అనే ప్రశ్న అనవసరం. శరీరం అనేది ఉండితీరాలి. దాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి అన్నారు మహాత్ములు. ప్రతిరోజూ డాక్టరుచేత విధిగా పరీక్ష చేయించుకొని తన రక్తపుపోటు తగ్గిందో హెచ్చిందో చూచుకొని, అతిశ్రద్ధగా ఆహార విహార నియమం గమనిస్తూ, క్షణభంగురమైన శరీరంమీద క్షణక్షణమూ శ్రద్ధాసక్తి చూపించిన మహాత్ముగు, వారాలకొలది నిరాహార దీక్ష, నిరాక్షేపణగా, నిశ్శంకగా, నిరభ్యంతరంగా, నిర్మొగమాటంగా సాగించి శరీరాన్ని నిర్లక్ష్యం చేశాడు.

సీతమీద ఎంత అనురక్తి,ఎంత ఆసక్తిఎంత మోహం, ఎంత మమకారం శ్రీరాముల వారికి ఉన్నదని వ్యక్తమైనదో చూడండి. ఆ యిల్లాలును నిండు చూలాలైయుండగా వనవాసానికి వాల్మీకాశ్రమానికి శ్రీరాముడు పంపించినప్పుడు అంత అనురక్తి అంత ఆసక్తి, అంత మోహం అంత మమకారం ఏమైంది? మహాత్ముడు తన దేహపోషణ ఎంత శ్రద్ధగా చేశాడో, శరీరాన్ని ఎన్ని తైలాలతో మర్దనచేశాడో, తన తూకం ఎంత శ్రద్ధగా చూచుకున్నాడో, ఎన్ని ఫలరసములను బలంకోసం స్వీకరించాడో, గమనిస్తే శరీరం అంటే ఆయనకుఅంత మక్కువ కాబోలునని మనము చటుక్కున ఒక్క మాటలో అంటాము. కాని, ఢిల్లీలో బిర్లా భవనఆవరణలో సాయంకాల ప్రార్థన సభలు జరుగుతున్నప్పుడు ఆయనమీద బాంబు వేయాలనే ప్రయత్నం జరిగింది. జరిగినట్లుగా మహాత్మునకు తెలియజేశారు. సాయంకాల ప్రార్థన సమావేశాలకు పోలీసు బందోబస్తు ఏర్పాటు చేస్తామని మంత్రియైన వల్లభాయి పటేలు బ్రతిమాలితే ససేమిరా నాకు యీ పోలీసు కాపలా వద్దన్నాడు. నా శరీరాన్ని అవిధంగా రక్షించనక్కరలేదన్నాడు. భగవంతుని రక్షణ కావాలి గాని భటుల రక్షణ అక్కరలేదన్నాడు.

శరీరప్రకృతిమీద ఉండే అనురక్తి ఎంతవరకో ధర్మసాధనకోసం శరీరాన్ని ఉపయోగించే మహాత్ములకే బోధపడుతుంది. ప్రకృతి అంతా సహధర్మచారిణివలె కన్పిస్తుంది. సృష్టిఅంతా మనోహరంగానే ఉంటుంది. మల్లెలు మొల్లలు మందమారుతములు మాత్రమే కాదు; తేళ్ళు మొసళ్ళు, రేచులు, తాచులు, తుపానులు, భూకంపాలుకూడా మనోహర భగవత్ చిద్విలాసాలుగా కన్పిస్తాయి. బ్రహ్మానందం కలుగజేస్తాయి. ఎవరికి?– బ్రహ్మజ్ఞానులైన బ్రహ్మర్షులకు. బ్రహ్మమయం అయిన ప్రకృతిని చూచి ఆనందించే పురుషుడు బ్రహ్మ కాకపోయినప్పటికీ, ఆ బ్రహ్మకు వాహనమైన హంస అయినా కావాలి. అటువంటి పరమహంసకు మన్మథవికారం గాని, "నేను అనుభవించాలి"అనే కామంతో, కోరికతో కూడిన అనురాగం గాని ఉండదు. ప్రకృతి అనేది స్త్రీవంటిదే. కాని ఆస్త్రీ రామకృష్ణపరమహంసకు జగజ్జననిగా మాతృస్వరూపంలో కన్పించింది. భక్తుడైనవాడు లోనుకూడా స్త్రీతత్వం పొందుతాడు. అంతా ఒకటే ప్రకృతి ఒకటే తత్వం—రామకృష్ణ పరమహంసకు ఆయన సహధర్మచారిణియైన శారదాదేవియందు జగన్మాత కన్పించింది. ఆయనకూడా దేవివలెనే వేషం వేసికొని ఆనందించి తన్మయుడైన సమయాలు ఉన్నాయి. అంతా స్త్రీమయం అంతా దేవీమయం అన్నాడు. ఒకసారి కలకత్తాలో గుర్రపుబండిలో ప్రయాణం చేస్తూ దేవిని తానే అనితన్మయుడైపోయినాడు. స్వయంగా చూచిన ఒక బ్రహ్మ సమాజీకుడు వివరించినవిషయం ఇది.

భక్తుడు పురుషుడే. కాని స్త్రీ భావం లోకి మారి శరణాగతుడైనప్పుడే పూర్తిగా భక్తుడవుతాడు. పురుషుడే స్త్రీయైన తర్వాత ప్రకృతి అంతా ఆ పురుషునకు తల్లికావాలి, తండ్రికావాలి. లేదా భర్తకావాలి. తన భోగంకోసమే యీ సృష్టి అనే భావం అభావం అవుతుంది.

"మదీయ భాసుర సమదృష్టి బ్రహ్మముగ జూచుచునున్నది విశ్వమంతయున్." అనే మహాత్ముడు శత్రువులను మిత్రులను ఒక్కరీతిగా చూస్తాడు. గాంధి మహాత్మునిపై రివాల్వరు పేల్చిన నాథూరాం వినాయక గాడ్సేలో కూడా భగవంతుడున్నాడు. "ఇదే మహాత్ముని జీవితాంత్య సందేశం" అంటె లవలేశం సంశయంలేదు.

"మదీయ భాసుర సమదృష్టి బ్రహ్మముగ
జూచుచునున్నది విశ్వమంతయున్"

అని మహాత్ముడు అనగల్గెనను మాట ముమ్మాటికీ నిజం. ★



విక్రమ్ ప్రొడ
క్షన్స్ వారి "మా
గోపి" లో జి.
వరలక్ష్మి,
నాగయ్య.



"సంసారం" లో
ఒక దృశ్యం
(మధ్యలో ఉ
న్నది ఎస్. వి.
రంగారావు.)



....మేఘమాశ్లిష్ట సానుం"

—ఫొటో: సి. వి. నారాయణమూర్తి (పెదవలి)